# నీలో కొన్నిసార్లు

బివివి ప్రసాద్



క వి త్వం

***NeelO Konnisaarlu***

*Telugu Poetry*

*by* ***BVV Prasad***



First Edition : July 2015

Cover Design : Ramana Jeevi

Poet's Photo : P. Jagannatha Raju

Poet's Address : B.V.V. Prasad
# 23-12-21, Sajjapuram
TANUKU W.G.Dt 534 211

Phone : 90320 75415

Email : prasadbvv1@gmail.com

Website : bvvprasad.blogspot.in

Printed at : Sri Sri Printers, Vijayawada

Price : Rs. 90

# క్రమసంఖ్య

# ఇతను

మానుషప్రపంచం మరీ అంత భయావహమైంది కాదని
నీ కలలోని భూతమే నిన్ను మ్రింగబోయినట్లు
నువ్వు విలువిస్తే బ్రతికే సమూహం నిన్ను కమ్ముకొంటుందని
సమూహాన్ని చెరిపేస్తూ నిన్ను గుర్తుచేయాలనే ఇతను మాట్లాడుతున్నాడు

నీదైన ఆకాశం కిందికి, సూర్యకాంతిలోకి, నీవైన గాలితెరల్లోకి, శ్వాసల్లోకి,
నీ చుట్టూ వాలుతూ, మాయమౌతున్న వెలుగునీడల రహస్యాలిపుల్లోకి
నీవి కాని రణగొణధ్వనుల్లోంచి రహస్యంగా పిలుస్తున్న నీవైన నిశ్శబ్దాల్లోకి
నీ చూపు మళ్ళించాలని కొన్ని మాటలు ఎంచుకొని
వాటిని సుతారంగా చెరుపుతూ నీ మౌనాన్ని నీకు పరిచయం చేస్తున్నాడు

ఏదో ఉందని తెలియటానికి నీలో ముందుగా మరేదో ఉండాల్సినట్లే
ఏదీ లేదని తెలియటానికి నీలో కాస్త ఖాళీ ఉంటే చాలునని
ఖాళీ ఉన్నచోటల్లా నదినిండినట్టు జీవితం నిండుతుందని

ఎప్పుడూ పాతదైన నిద్రలోంచి, ఎప్పటికీ కొత్తదైన మెలకువలోకి
మెలకువలాంటి పూలలోకి, గాలిలోకి, మౌనంలోకి, కాంతిలోకి
జీవితం పంపిన దూతలా పిలుస్తున్నాడు

*రచనాకాలం: 29.11.2014 మధ్యాహ్నం 12.31*
*ప్రచురణ: బ్లాగ్: 28.5.2015*

# కవిత్వం చదివేటపుడు

కవిత్వం చదవబోతున్నపుడైనా నీలో మెత్తదనం ఉండాలి
వెలితిగా వున్న ఆకాశంనిండా
మెలమెల్లగా విస్తరిస్తున్న మేఘంలాంటి దిగులుండాలి

అక్షరాలపై సంచరించే చూపు వెనుక
ఒక వర్షం కురిసేందుకు సిద్ధంగావుండాలి

కవిత్వాన్ని సమీపిస్తున్నపుడైనా
వానకాలువలో పరుగెత్తే కాగితం పడవలో ప్రయాణిస్తూ
సుదూరదేశాల మంత్రనగరుల్ని ఊహించే
అమాయకత్వం నీలో మేలుకోవాలి

కవి ఏమీ చెయ్యడు
కన్నీటిలోకో, తెలియనిలోకాలపై బెంగపుట్టించే సౌందర్యంలోకో
తను చూసిన దారిలోకి ఆహ్వానించటం మినహా
కవి నిన్ను పిలిచినపుడైనా
మగతనిదురలోంచి జీవించటంలోకి చకచకా నడిచివెళ్ళాలి

నిజానికి, కవిత్వాన్ని సమీపించినపుడైనా
మనందరి ఏకైక హృదయాన్ని సమీపించే రహస్యం గురించి
నీకు నీదైన వెదుకులాట వుండాలి

*రచనాకాలం: 5.11.2014 మధ్యాహ్నం 2.40*
*ప్రచురణ: వాకిలి.కాం జనవరి 2015*
*బ్లాగ్: 17.1.2015*

# నీలో కొన్నిసార్లు

నీలో కొన్నిసార్లు ఉత్సవముంటుంది

అప్పుడు నీకందర్నీ పలకరించాలనిపిస్తుంది
పూలతో, పిట్టలతో, దారినపోయే మనుషులతో తోచిన మాటలన్నీ మాట్లాడాలనిపిస్తుంది
దు:ఖంచే నేత్రాలపై మృదువుగా ముద్దులు పెట్టాలనిపిస్తుంది
ఎవరేమనుకొంటే ఏమిటని వచ్చీరాని పాటలన్నీ పాడాలనిపిస్తుంది
దేహాన్నొక కెరటం చేసి నర్తించాలనీ,
నలుగురు పిల్లల్ని ప్రోగుచేసి పరుగుపందెంలో వాళ్ళతో ఓడిపోవాలనీ అనిపిస్తుంది

నీలో కొన్నిసార్లు నిరాశ వుంటుంది

అప్పుడు ప్రకాశిస్తున్న ఎండలోకి ఎవరో చీకటిని ఒంపుతున్నట్లుంటుంది
కనిపించని తలుపులన్నీ మూసుకొంటూ లోలోపలికి వెళ్ళిపోవాలనిపిస్తుంది
గండశిలవంటి కాలాన్ని పగులగొట్టి దిగంతాలకి విసిరేయాలనిపిస్తుంది
తెలియని ఉప్పెన ఏదో నలువైపులా నుండీ ముంచేస్తున్నట్లుంటుంది
విసుగువేరు తొలుచుకొంటూ వెళ్ళి నిన్ను పూర్తిగా ఖాళీ చేసుకోవాలనిపిస్తుంది

కొన్నిసార్లు నీలో కోరికల సమూహాలుంటాయి

నీ ఇంద్రియాలు వికసించి లోకాన్నొక దాహకమై కమ్మేయాలనిపిస్తుంది
చూసినవన్నీ కోరక ముందే స్వంతం అయిపోవాలనిపిస్తుంది
ప్రపంచం నీ ముందు మోకరిల్లి నిన్ను కీర్తించాలనిపిస్తుంది
మృత్యువుకే నిన్ను చూస్తే భయం వేయాలనిపిస్తుంది

కొన్నిసార్లు భయముంటుంది నీలో

రాత్రి వచ్చిన కలచివర ఊహకందని శక్తి ఏదో ఎత్తుకుపోయినట్లుంటుంది
నిన్ను నొక్కిపెడుతున్న ఎవరినో శక్తికొద్దీ విసిరేయాలనిపిస్తుంది
రానీ, చూసుకొందామనే మొండిధైర్యంలోకి పూర్తిగా దూకేయాలనిపిస్తుంది
ప్రపంచాన్ని కూర్చోబెట్టి గబగబా పాఠాలు చెప్పేయాలనిపిస్తుంది

ఒకసారెపుడో నీలో నిష్కపటమైన దయ వుంటుంది

గాయపడ్డ ప్రాణాలన్నిటినీ దగ్గరగా హత్తుకోవాలనిపిస్తుంది
లోకం చేసిన గాయాలన్నీ పోనిద్దూ అని మరిచిపోవాలనిపిస్తుంది
ప్రపంచాన్ని పసిబిడ్డని చేసి ఎత్తుకోవాలనిపిస్తుంది
అప్పుడు నీకు జీవితమ్మీద జీవితమంత ప్రేమపుడుతుంది

అరుదుగా ఒకసారి శుభ్రమైన మౌనం వుంటుంది

ప్రపంచాన్ని చూసి ఒకే ఒక్క పసినవ్వు నవ్వాలనిపిస్తుంది
రాలినపూవు నేలని తాకిన చప్పుడు నీలో కోమలంగా కరిగిపోయినట్లుంది
సూర్యోదయాన్ని దోసిలిలో ఒంపుకొని సుతారంగా త్రాగినట్లుంటుంది
ఆకాశం పక్షిరెక్కయి శాంతిలోకి ఎగురుతున్నట్లుంటుంది
అప్పుడు, మొదటిసారి జీవితాన్ని నిజంగా జీవిస్తున్నట్లుంటుంది

*రచనాకాలం: 26.7.2014 ఉదయం 11.38*
*ప్రచురణ: బ్లాగ్: 16.8.2014*

# గాజుగోళీ

చిన్నపుడు
పారదర్శకమైన గాజుగోళీలో రంగురంగుల ప్రపంచాలని చూసినపుడు
గోళీలోకి వెళ్ళిపోయి ఆ రంగుల్ని తాకితే బావుండుననిపించేది

ఎటునుంచీ లోనికి వెళ్ళే వీలులేని
నున్నని గాజువలయం మీదినుండి నా కల జారిపోతూవుండేది

గోళీలో రంగులూ, గోళీ వెలుపల నేనూ
మా మధ్యన స్వచ్ఛమైన దిగులుతో మెరిసే క్షణాలూ

ఒక గుర్తులేని ఉదయం
గోళీలు నా బాల్యాన్ని వెంటబెట్టుకొని
చిరునామా తెలియని లోకాలకి వలస వెళ్ళిపోయాయి

పర్వతాల్లా, మహావృక్షాల్లా కనిపించే
పెద్దవాళ్ళలో ఒకడినైపోవాలనే కల ఒకటీ
కాలం తన ఒడిలో కూర్చోబెట్టుకొని నిజంచేసి చూపించింది

వెనుతిరిగి చూసుకొంటే
బాల్యాన్ని కోల్పోవటమే ఉంటుంది కానీ,
పెద్దవాళ్ళం కావటం ఉండదని అర్థమయింది

ఊహల మంత్రదండం తలపై తాకించుకొని
బాల్యంలో నిలబడి ప్రపంచాన్ని పరికించాను ఒకసారి

విశ్వం ఒక గాజుగోళీ!
పారదర్శకమైన గాజుశూన్యంలో చలించే రంగుల ప్రపంచం ఇది!
వలసవెళ్ళిన బాల్యం తిరిగివచ్చి నన్నొక గాజుగోళీ లోపల నిలబెట్టింది!

ఇప్పుడు
ఎటునుంచీ బయటికి వెళ్ళే వీలులేని
నున్నని గాజువలయం అవతల ఏముందో తెలుసుకోవాలనిపిస్తోంది!

*22.1.2013*
*'ఆదివారం' ఆంధ్రజ్యోతి దినపత్రిక 24.2.2013*
*బ్లాగ్: 24.2.2013*

# పసుపుకాంతి

ఈ పసుపురంగు పూలని చూస్తున్నపుడు
ప్రపంచం కాసేపు మాయమౌతుంది
పుట్టాక మొదటిసారే ఈ రంగుని చూసినట్టు
పసుపుకాంతిలోకి ప్రవేశిస్తాను

“నువ్వు ప్రపంచంలోకి ఎందుకు వచ్చావో
ఎందుకు గొడవపడతావు
ఇక్కడ నువ్వు చూసేందుకు నేనున్నాను

నదిలోకి పడవ జారినట్టు,
ఎక్కడి కిరణమో నీవరకూ, నావరకూ వాలినట్టు
ఫలం నాలుకపై రుచిలా వికసించినట్టు,
నాలోకి జారిపో, వాలిపో, వికసించు

ఈ వివశత్వానికి ముందు
నువ్వెవరో, నేనేమిటో ఎందుకు చింతిస్తావు
ఈ రససంయోగం తరువాత
ఏం కావటంలోకి విడిపోతామో, ప్రయాణిస్తామో ఊహిస్తావు

ఈ క్షణంలో మనం ఒకటి కావటంలోనే
పురాతనకాలాల విశ్రాంతి కొలువుదీరింది
ఈ విశ్రాంతిలోనే సమస్తసృష్టి
నదిలో ప్రతిఫలించే ఆకాశంలా తేలుతూవుంది”

పసుపుకాంతీ, నేనూ ఒకటైన క్షణాలలో
నక్షత్రాలు నా ప్రక్కగా వెళ్ళిపోతూవుండటం గమనించాను
ఒక గాఢమైన నిశ్శబ్దం
"ఏదీ లేదు, ఊరుకో" అంటూ వుండటం చివరిసారి విన్నాను

*20.12.2013 ఉదయం 11.40*
*ఈమాట.కాం జూలై 2014*
*బ్లాగ్: 18.7.2014*

# వానలోకం

ఊహించనిరోజున ప్రియమైనవ్యక్తి ఎవరో నీ గుమ్మంలో నిలబడినట్టు
ఈ వేసవి ఉదయం లేచేసరికి నీ ఇంటిచుట్టూ వానపంజరం

చెట్ల ఆకులమీద వాన, కొమ్మలమీద వాన,
వాన నీటిమీద వాన, నీటిలోని ప్రతిబింబాలమీద వాన

వాననెమలి నీ ఇంటిచుట్టూ పురివిప్పి తిరుగుతున్నపుడు
నీ ఇల్లు అరణ్యంలో వున్నట్లూ,
సరిహద్దుల్లేని మరోలోకంలోకి నువ్వు ప్రవాసం వెళ్ళినట్లూ వుంటుంది

మూగవెలుతురులో మునిగిన ప్రపంచం ఇప్పుడు
ఆటలన్నీ కట్టిపెట్టి వానధ్యానంలోకి తనని కోల్పోతుంది కాసేపు

జీవితమంటే నీ మనోలోకాల గోల కాదని
వెళ్ళిపోతున్న ఆకాశాన్ని కన్నార్పక చూడమనీ
చెప్పి, చెప్పి విసుగు పుట్టినట్లు
చల్లని చినుకై చరిచి నీకంటిన నల్లని కాలాన్ని కడుగుతుంది వాన

నువ్వు మనిషిలా రాకపోయి వుంటే వానవై పుట్టేవాడివనుకొంటాను
బహుశా, లోకపు ఏ కొలతలోనో నువ్వొక వానవయ్యే వుంటావు
లేకుంటే వాన కురిసినపుడల్లా
నీకు దిగులు ముసురుకొన్న చల్లని సంతోషం ఎందుకు కలుగుతోంది

*9.5.2014* మధ్యాహ్నం *12.55*
'ఆదివారం' ఆంధ్రజ్యోతి దినపత్రిక *22.6.2014*
బ్లాగ్: *22.6.2014*

# ఎండ

ఆరుబయట ఎండకాస్తున్నపుడు
ఎవరో "జీవితమొక ఉత్సవం, ఇలా రా ఆడదా"మని పిలుస్తున్నట్లుంటుంది

జీవితం కొనల ఎగిరే శూన్యపతాకం సమీపిస్తున్నకొద్దీ
ఎండలోకి చూడటం వ్యామోహంగా మారుతోంది
జీవితమంతా ఏం చేసావని అడిగితే ఎండలో తిరిగానని చెప్పాలనిపిస్తుంది

గడచిన బాల్యంలో ఇదే ఎండక్రింద
పొలాల మధ్యా, కాలవల్లోకీ దేహాన్ని గాలిపటంలా ఎగరేసిన రోజులు
గడచిన యవ్వనంలో ఇదే ఎండక్రింద
మిత్రుల నవ్వుల్లోకీ, యువతుల స్వప్ననేత్రాల్లోకీ నిర్లక్ష్యంగా తప్పిపోయిన పగళ్ళు

గడచిపోతున్న నడివయస్సులో ఇదే ఎండక్రింద
నీకూ, లోకానికీ మధ్యనున్న దగ్గర, దూరాలని సరిగా లెక్కకట్టలేక
దిగుల్లోకీ, ప్రశ్నల్లోకీ నిన్ను చేజార్చుకొంటూ తిరుగుతున్న క్షణాలు, యుగాలు

అన్నీ మారిపోతున్నాయి ఇదే ఎండక్రింద
నమ్ముకొన్న దేహంకూడా కాంతి జారిపోగా వెలిసిపోతున్న ఇంద్రధనువవుతుంటే
బాల్యంలో దొరికిన ఎండకాగితం మాత్రం
ఇప్పటికీ మాసిపోక, వెలిసిపోక మెరుస్తోంది కంటిముందు

నువు చూడని స్థల, కాలాల చిత్రాలని చూసినపుడల్లా
అదిగో వాటిలో వాలుతోన్న ఎండ, దానికింద తేలుతోన్న

మనుషుల చిరునవ్వులు, సుందరదృశ్యాలని సంతోషంగా చెప్పుకొన్నపుడు
ఒకటే ఎండపొర కింద ఉన్నదంతా ఒకటేనని ఎవరో నీలో కేరింతలు కొడతారు

మరికాసిని ఎండల తర్వాత వెళ్ళిపోతావు కదా అని దిగులు కలిగినపుడల్లా
పోనిద్దూ, వెళ్ళాక కూడా ఎండ ఇలా కాస్తూ వుంటుందని ఊరడించుకొంటావు

ఇంతకూ ఎండంటే, సూర్యనేత్రం విప్పార్చి
అనాదిగా జీవితం కంటున్న పగటి కలే కదా

*23.5.2014 మధ్యాహ్నం 1.11*

# సీతాకోకా!

ఈ సిమెంటు మెట్లపై నీకేం పని సీతాకోకా

పూలని సృష్టించుకొన్న జీవితం
తృప్తిలేక ఎగిరే పూవుల్లా మిమ్మల్నీ కలగంది సరే
మాలోపలి మోటుదనంతో సరిపెట్టుకోక
సిమెంటుతో కట్టుకొన్న కవచాలతో నీకేం పని

ఊరికే ఎందుకలా గాలికి రంగులద్దుతూ ఎగురుతావు
ఆకాశాన్ని సుతిమెత్తని రెక్కల్తో నిమురుతావు
విచ్చుకొన్న నవ్వులాంటి ఎండ పెదవుల పైన
ప్రేమ నిండిన పదంలా సంచరిస్తావు

మరింత ఇరుకుదారులు వెదుక్కొంటూ
నన్ను గొంగళిపురుగులా మార్చుకొంటున్నపుడు
కాలం మీటుతున్న నిశ్శబ్దగీతాన్ని కళ్ళముందు పరుస్తూ
నా దారికి అడ్డుపడతావెందుకు, ప్రియమైన సీతాకోకా

సూర్యుడువాలే ఏ దిగంతాలరేఖమీదనో
ఇటునుంచి నేను చీకటిలానూ
అటునుంచి నువ్వు ఆకాశపుష్పం రాల్చే రంగుల్లానూ
కలిసే వరకూ, ఇలా ఉండనీయవా, సీతాకోకా!

*23.6.2014* మధ్యాహ్నం *11.59*
నవ్య వారపత్రిక *10.9.2014*
బ్లాగ్: *4.9.2014*

# వానాకాలంలో

వానాకాలం జీవితానికి ఉత్సవ సమయమైనట్టు
ఎక్కడెక్కడినుండో పుట్టుకొస్తాయి రకరకాల జీవులు

అప్పటివరకూ నేలపొరల్లో దాగాయో, గాలితెరల్లో దాగాయో,
ఆకాశంలో తేలే స్వప్నలోకాల సంచరించాయో కాని

ఆకాశం జలదేహం దాల్చి భూమిని హత్తుకొన్నపుడు
ఆకుపచ్చని మొనలు తెరిచీ, అప్పుడే తెరిచిన కళ్ళల్లో ఆకాశాన్ని దాల్చీ,
గాలికి రాగాలు అద్దుతూ భూమ్మీద తెరుస్తాయి క్రొత్త కచేరీలు

నిన్నటివరకూ పొడిగా, శుభ్రంగా ఉన్న నేలపై, గోడలపై ఒకటే జీవుల సందడి
ఏమరుపాటున నడిస్తే కాలిక్రింద ఏ ప్రాణం పోతుందోనని
తెల్లనిమేఘాల వెంట గాలిపటంలా పరుగెత్తే చూపుల్ని బలవంతంగా నేలకి దించుతావు

ఒక చీమలబారో, గొంగళిపురుగో, కప్ప అరుపో నీ చైతన్యాన్ని తాకిన ప్రతిసారీ
ఇక నువ్వు ఒంటరివాడివి కావని జీవితం నీ చెవిలో గుసగుసలాడినట్లనిపిస్తుంది

*6.8.2014 మధ్యాహ్నం 2.32*
*తెలుగు.వన్ఇండియా.ఇన్ 7.9.2014*
*బ్లాగ్: 10.9.2014*

# సాయంత్రపు నడక

నువ్వు నడవక తప్పదని వైద్యులు చెప్పినపుడు
రోజువారీ పనుల్ని అటూఇటూ సర్ది
ఖాళీ సాయంత్రాలను సృష్టించడం కష్టంగా తోచింది కానీ,
రోగాలూ మేలుచేస్తాయని నడక మొదలయ్యాక తెలిసింది

కాలేజీస్థలంలో వలయాకారపు నడకదారిలోకి
గడియారమ్ముల్లులా చొరబడినప్పుడు
విస్తృత ప్రపంచమొకటి వెలుపలా, లోపలా కన్ను తెరుస్తుంది

చుట్టూ మూగిన చిక్కటి చెట్లు వేల ఆకుపచ్చని ఛాయల్ని
వెలుగుకీ, చీకటికీ మధ్య మెట్లవరుస కట్టి చూపిస్తాయి
అడుగుకో రూపం దాల్చే చెట్లు
రహస్యసంజ్ఞలతో పిలిచే అదృశ్యలోకాల్లోకి ఆశ్చర్యపోతూ దారితప్పుతావు

లోపల ముసురుకొన్న చిక్కుల్లోంచి
ఆకాశపు మైదానంలో ఆడుకొనే పిల్లగాలుల్లోకీ
సాయంత్రపు కిరణాల జారుడుబల్లల మీదికీ వాలిపోతావు

దారినీ, మనస్సునీ ఇరుకుచేసే సహపాదచారుల సంభాషణల్లోంచి
విశాలత్వంలోకి ఎగిరేందుకు చూపుని ఆకాశం వైపు మళ్ళిస్తావా
“వచ్చావా” అంటుంది ఆకాశం
“నీ అనారోగ్యం పంపిస్తే రాలేదు, నేను రప్పించుకొంటే వచ్చా”వని నిర్మలంగా నవ్వుతుంది

అనాది ఆకాశం క్రింద అనాది హృదయస్పందన
మౌనంగా ప్రేమవృత్తాలు చుడుతుండగా
చిక్కబడుతున్న చీకటిలో నీడలూ, చెట్లూ, నువ్వూ
నిశ్శబ్దంలోకి చేరుకొనే చివరిశబ్దాలలా కరిగిపోతారు

*26.7.2014 మధ్యాహ్నం 1.06*
*వాకిలి.కాం సెప్టెంబర్ 2014*
*బ్లాగ్: 3.9.2014*

# కిటికీలోంచి చెట్లు

పనులన్నీ ప్రోగుపడి ఏంచేయాలో తోచని ఉక్కపోతలో
ఉన్నట్లుండి, ఎన్నడూ తెరవని కిటికీ తెరిస్తే
ఆకుపచ్చని చెట్లగుంపు బడిపిల్లల్లా కుదురుగా కళ్ళముందు వాలింది

ఏమంత తొందర లోకమంతా తిరగాలని
ఉత్సాహం చూసిందంతా అనుభవించాలని
ప్రతిక్షణమూ పవిత్రంగా వెలుగుతోందని
ప్రతిస్థలమూ స్వంత ఇల్లై పిలుస్తోందని గ్రహిస్తే
ఇలా అల్లల్లాడవని, వెళ్ళే ప్రతి గాలికెరటాన్నీ
ఆకుల అరచేతుల్తో లాలనగా నిమురుతూ చెబుతున్నాయి చెట్లు

చెట్లని చూసినపుడల్లా నెమ్మది, మరికాస్త నెమ్మది అని
నీతో కూడా చెబుతున్నట్లనిపిస్తుంది
మీలా ఉండే వీలులేదు, చాలా పనివుంది మరి అనుకొంటూ
వడివడిగా నడుస్తావు జీవితమంతా

కడపటి క్షణాల్లో చేయగలిగిందింకేమీ కానరాక
మూసివున్న కిటికీ మరోమారు తెరిచినపుడు
ఆకుపచ్చని జీవనగీతాన్ని అతిశాంతంగా ఆలపిస్తూ కనిపిస్తాయి

జీవితమంతా చేసిన పనులన్నీ కలిపి
ఒక్క ఆకుపచ్చని ఆనందమైనా కాలేదనీ
మాటలన్నీ ఓ పసుపుపచ్చని పూవుగానైనా వికసించలేదనీ గ్రహిస్తావు

అప్పుడా చెట్లు,
నిదురనుండి మెలకువలోకి జారినంత సుతారంగా వీచే
చిరుగాలి కెరటమొకటి విసురుతూ
స్నేహితుడా, ఇపుడైనా కాస్త నెమ్మది
వెళ్ళిపోయేటపుడైనా ఈ పూవులా రాలగలవేమో చూడు అంటాయి

*19.10.2014 మధ్యాహ్నం 12.04*
*బ్లాగ్: 22.5.2015*

# పూవురాలేను

పగటి కాంతిరేకలు చీకటుల సోలినటు
మధురస్వప్నమొకటి మెలకువన జారినటు
ఆమె వెన్నెలనవ్వు నీలోకి వాలినటు
పూవురాలేను పూవువలె నెమ్మదిని

గాలివాలువెంట ఒంపు తిరిగి
గాలినొక పూవుగా హొయలు దీర్చి
రంగురంగుల గిరికీలు చుట్టి
కాంతినొక పూవుగా చిత్రించి విడచి

నేలపై మృదువుగా మేనువాల్చి
నేల నొకపూవు రేకులా మలచి
పూవొకటి రాలేను ఇచట ఈ స్థలములో
తననీడపై తాను సీతాకోకయ్యి వాలేను

సెలయేటి పరుగులా, పసిపాప నవ్వులా
చిరుగాలి తరగలా, పరిమళపు తెరలా
పూవొకటి రాలేను ఈ క్షణములోన
పూవంటి క్షణమొకటి రాలేను స్వప్నమ్ములోన

*19.9.2014* మధ్యాహ్నం *3.10*
నవ్య వారపత్రిక *31.12.2014*
బ్లాగ్: *26.12.2014*

# రంగులెపుడు..

రంగులెపుడు తొలిసారి పరిచయమయ్యాయో జ్ఞాపకముందా
బొమ్మలపైనా, అమ్మ చీరలపైనా, పూలపైనా, మేఘాలపైనా
రంగులెలా తొలిసారి ఆశ్చర్యపరిచాయో స్మృతులు మిగిలాయా

పసుపూ, ఎరుపూ, నీలం, తెలుపూ, నలుపుల వేల ఆటలు
పేర్లతో అలవాటుపడక ముందు ఏ రహస్యలోకాల సందడి చేసాయో గుర్తుందా

ఇంకా అపుడపుడూ విస్మయపరుస్తాయి రంగులు నన్ను
వ్యాకులతలూ, భయాలూ చీకటిలా ముసిరినపుడు బాల్యస్నేహితుల్లా సేదదీరుస్తాయి
ముకుళించటం మృత్యువు, వికసించటం జీవితమని వెన్నుతడతాయి

దైవానికి దయలేదనీ, ఆయనకు మాటలు రావనీ ఎవరైనా అన్నపుడల్లా
వెలుతురు ఆయన దయ అనీ, రంగులు ప్రేమభాషణ అనీ చెప్పాలనిపిస్తుంది

రంగులు వెలిసిపోవటం ఎపుడు మొదలయిందో వెనుదిరిగి చూసావా
చిననాటి పుస్తకాలతో పాటు, దాచుకొన్న నెమలీకనీ జీవితంలోంచి విసిరేసిన క్షణాలలో
మనలోంచి మాయమైన అమాయకత్వాన్ని ఎపుడైనా తడుముకొన్నావా

తెల్లనికాంతీ, కాంతినుండి ఎగిరే రంగులపక్షులూ ఎటు వెళ్ళిపోయాయో,
కాంక్షలమేఘాలతో జీవితమెలా మాసిపోయిందో ఎపుడైనా బాల్యాన్నడిగి తెలుసుకొన్నావా

*23.9.2012*

*'సాహితి' ఆంధ్రభూమి దినపత్రిక 11.2.2013*

*బ్లాగ్: 11.2.2013*

# చూస్తున్నామా

ఎడారిలో ఇసుకలా వజ్రాలు దొరికితే
భూమి అరుదుగా ఒకచోట పూలని బహూకరిస్తే
మనుషుల్లో రసాత్మకత మరొకలా వ్యక్తమయేది

ఏడాదికి ఒకసారే సూర్యకమలం వికసిస్తే
జన్మకి ఒకరాత్రే ఆకాశం నక్షత్రఖచితమై మెరిస్తే
మానవహృదయాలు అరుదుగానైనా సౌందర్యంతో భాసిల్లేవి

జీవితానికి దయవుంది గనుకనే
చుట్టూ ఇంత అందం, ఆనందం పరిచి
చిరునవ్వుతో వారిని సృజించి విడిచింది సృష్టిలో

దయగల తల్లికి పుట్టిన యోగ్యతలేని బిడ్డల్లా
ఆట కోసం అల్లుకొన్న ఊహల వృత్తాలలో చిక్కి
విప్పారే ఆకాశంక్రింద నిలిచికూడా ఊపిరాడట్లేదని దుఃఖిస్తారు

పొందవలసిందేమీ లేదు, పోవలసిందెంతో వుందని
కవి పాడుతూ వెళ్ళిపోతాడు
కొందరికి వలయాలు చిట్లి తేలికపడతారు
మరికొందరు మరిన్ని ప్రశ్నల్లోకి దిగులుపడతారు

అప్పుడు, గాలిదేహంతో తల్లి వాళ్ళని కౌగలించుకొని
నుదుటిపైన ముద్దుపెట్టుకొన్నట్లు నిద్రపుచ్చుతుంది

*23.5.2014 మధ్యాహ్నం 12.03*
*కవితా మే-జూన్ 2014 బ్లాగ్: 4.8.2014*

# వానంటే

ఉన్నట్లుండి వాన మొదలవుతుంది
తడిసేందుకు జడిసే నువ్వు కుదురుగా ఇంట్లో కూర్చొని
వానంటే ఏమిటని ఆలోచిస్తావు

వానంటే
మౌనంగా కనిపించే ఆకాశం దాచుకొన్న కబుర్లన్నీ నేలతో పంచుకోవటమా
శూన్య హృదయంలో దాగిన సౌందర్యాన్ని ఏడురంగుల్లో విరజిమ్మటమా
గగనసమాగంతో మత్తిల్లిన ధరణి మట్టివాసనల నిట్టూర్పులు విడవటమా

లేదూ,
జీవితపు నయనాలు చెమ్మగిలి ఆకాశపు చెక్కిలిపై జారే కన్నీరా
జలతారు పైట కప్పి ఆ దేవత ఇచ్చే చనుబాలా

వానంటే ఏమిటని ఊహిస్తూ వుండగానే
ఆకుల నిండా వానని ఒంపుకొంటాయి ఇంటి ప్రక్క చెట్లు

వానతెరలు తొలగిన ఆకాశంలో కొత్త కాంతుల్ని
బయటకు వెళ్లి తమకంగా చూడబోయినపుడు
గుప్పెడు నీటిముత్యాలు నీ తలపై చల్లి చెబుతాయి
"వానంటే ఒక నిండైన జీవితానుభవం, అది నీ ఊహల్లా తేలికైనది కా"దని

*22.8.2014 మధ్యాహ్నం 1.08*

# మనమంతే..

నది ఒడిలో సేదదీరుదామని వెళ్ళి
కదులుతున్న పడవగదిలో
అందరం కబుర్లు చెప్పుకొంటూ గడిపాం రోజంతా

సంధ్య వాలేసరికి
కబుర్లలోంచి, గదిలోంచి, నదిలోంచి
బయటకు నడిచాం ఎవరిదారిన వాళ్ళం

మనమంతే -
నదినీ, జీవితాన్నీ
ప్రేమించడమెలానో మాట్లాడుకొనే సందడిలో
వాటిని ప్రేమించడం మరిచిపోయి పడవదిగి వెళ్ళిపోతాము

*10.11.2012*
బ్లాగ్: *2.8.2014*

# గమనించము కానీ

గమనించము కానీ, దీర్ఘప్రవాసం తరువాత ఇల్లు చేరినపుడు
ఇల్లు కూడా కాసేపు మనని అతిథిలా చూస్తుంది

ఇంటిగోడలూ, వెలిసిన రంగులూ, ఇంటిలోని వస్తువులూ
ఇవాళ వాకిట్లో పూసిన పూలూ, మన మనుషుల మాటలూ
ఎవరీ మనిషని చూస్తున్నట్లూ, ఎవరినో పలకరిస్తున్నట్లూ వుంటాయి

గమనించము కానీ, గాఢమైన నిద్రనుండి మేల్కొన్నపుడు కూడా
మనచుట్టూ వున్న ప్రపంచం అప్పుడే పుట్టినట్లుంటుంది
ఆ క్షణమే ఎవరో ప్రపంచాన్ని తెచ్చి పరిచినట్లుంటుంది
అప్పుడు, తాజాగాలులు మొదటి శ్వాసలా దేహంనిండా వ్యాపిస్తాయి

మేలుకొన్నపుడూ, ఇంటికి వచ్చినపుడూ
మనలో పసిపిల్లల అమాయకత్వమేదో గోడమీది నీరెండలా పారాడుతుంది
తామేం చేస్తున్నాయో తెలియకుండానే
కఠినమైన ప్రపంచాన్ని కోమలమైన రంగులతో నింపే పూల మృదుసౌందర్యంవంటిది
మనలో లీలగా, దూరపుపాటలా, వాగు ఇసుకపై నీటిపొరలా చలిస్తుంది

గమనించము కానీ, ఇల్లూ, మెలకువా పాతబడే కొద్దీ
నెమ్మదిగా మనవాళ్ళూ, ప్రపంచమూ మనలో నిండే కొద్దీ
దేనినో కోల్పోతున్న దిగులొకటి
ఇసుకపొరలు దాటుకొంటూ వాననీరు పాతాళంలోకి ఇంకుతున్నట్లు
మనలోనికి ఇంకుతూ వుంటుంది

*5.8.2012 బ్లాగ్: 5.8.2012*

# ఒక్కొక్క కొత్తమనిషి

ఒక్కొక్క కొత్తమనిషి నా జీవితాన్ని దర్శించినప్పుడల్లా
మరికొంత సంపన్నుడినయినట్లూ,
మరికొంత వెలుతురు నాలో పసిపాపలా పారాడుతున్నట్లూవుంటుంది
నా స్వప్న ప్రపంచంలో కొత్త రంగులు ప్రవేశిస్తాయి
ఇంతకు ముందు విని ఎరుగని పిట్టలూ, చూడని పూలూ
తెర ఏదో తొలగినట్లయి దర్శనమిస్తాయి

ఒక్కొక్క కొత్తమనిషి నా కాంతిలోకి ప్రవేశించినపుడల్లా
అపుడే జీవించటాన్ని మొదలుపెట్టినట్లుంటుంది
నా పదాలు కొత్త అర్థాలలోకి మేలుకొంటాయి
ఓ చిరునవ్వు గాలిలో గిరికీలు కొట్టి వచ్చి భుజం మీద వాలుతుంది

'జీవితమంటే ఇదీ' అని ఇప్పటికింకా నిర్వచించుకోలేకపోయాను కానీ
నాముందు మసలే ప్రతి కొత్తమనిషీ దాని రహస్యమేదో చెప్పబోతున్నట్లనిపిస్తుంది

అయినా ఒక విషాదం సాయంత్రపు నీడలా వెంటాడుతూవుంటుంది
ఒక్కొక్క కొత్తమనిషీ చూస్తూ ఉండగానే ప్రాచీన జ్ఞాపకంలా మారిపోతాడు
అతనిపై నాకోసం నేను పరిచిన సంతోషపు వెలుతురు పరదా జారిపోయాక
అతను చీకటిలో తడుస్తున్న దేవాలయంలా కనిపిస్తాడు

ఊరి నుండి ఊరికి తిరిగే విశ్రాంతిలేని బాటసారిలా
మనిషి నుండి మనిషికి ప్రయాణిస్తూనే వుంటాను

నేను కూడా ప్రతి మనిషిలో
కొంత వెలుతురూ, చీకటీ ప్రవేశపెట్టి వెళతాననుకొంటాను
వెళుతున్నపుడు నా వెనుక ఏవో ప్రపంచాలని మోసుకొంటూ
కొన్ని చూపులు సీతాకోకల్లా అనుసరిస్తున్న చప్పుడేదో వినిపిస్తూ వుంటుంది

బహుశా, చరమాంకంలో ఒకమనిషి వస్తాడు
"జీవితమంటే ఏమి"టని అడిగినప్పుడు ఒక అద్దం తెచ్చి ముందుంచుతాడు
దానిలో జీవితమంతా దర్శించిన వేలమంది మానవులు
దయగా నన్ను చూసి నవ్వుతారు

అప్పుడు, వారి నవ్వులతో చెమ్మగిలిన శబ్దమొకటి
వచ్చిన దారిని కనుకొని నిశ్శబ్దంలోకి మరలిపోతుంది

*22.8.2012*
*నవ్య వారపత్రిక 26.9.2012*
*బ్లాగ్: 19.9.2012*

# దినచర్య

ఉదయం తూర్పుగుమ్మం తలుపులు తెరవగానే
అప్పటివరకూ గుమ్మంతెరపై ఆడుకొంటున్న కాంతిదేవతలగుంపు గదిలోకి ప్రవేశిస్తుంది
ఈ వెలుతురు ఉత్తవెలుతురు కాదనుకొంటాను
ఇది గదిలోని చీకటినీ, లోని దిగులునీ మాయం చేస్తుంది

పసినవ్వులాంటి స్వచ్ఛమైన వెలుతురు, నక్షత్రాల కాంతివంటి లోతైన వెలుతురు
చొరవగల స్నేహితునిలా నాలోంచి నన్ను బయటికిలాగి ప్రపంచంలోకి తోసేస్తుంది
అప్పుడు ప్రపంచంనిండా పరుచుకొన్న జీవితోత్సవానికి విశాలంగా తెరుచుకొంటాయి కనులు
నవ్వుతానో, గాయపడతానో, నవ్విస్తానో, గాయపరుస్తానో నా పాత్ర నేను పోషిస్తాను

నా నమ్మకాలూ, ఉద్వేగాలూ పగలంతా తోలుబొమ్మను చేసి ఆడిస్తాయి
దినాంతాన ముఖంమీద పరుచుకొన్న ప్రియురాలి వస్త్రంలాంటి వెలుతురు
ఏ గాలీ వీయకుండా ఎటో ఎగిరిపోతుంది
దిగులులాంటి చీకటి విశాలబాహువులు చాపి హృదయానికి హత్తుకొంటుంది

అనాదికాలపు జీవితేచ్ఛ ఊహల కొమ్మలతో నిండిన వృక్షంలా నిలబెడుతుంది
ఇవాళ సంపాదించుకొన్న సుఖదుఃఖాలు వలసపక్షుల్లా నాలో చేరి రణగొణధ్వని చేస్తాయి
పక్షుల సందడి ప్రాచీన నిశ్శబ్దంలో కరిగిపోయాక
రేపు మళ్ళీ కొత్తగా వచ్చేందుకు, ఈ రాత్రిలోకి మాయమౌతాను

*23.2.2012*
*బ్లాగ్: 3.8.2012*

# రోజుల బొమ్మలు

పగలంతా కాలం నదిలో
దృశ్యాలు, ముఖాలు, ఉద్వేగవలయాలు ప్రవహించిపోతాయి
నది ఒడ్డున చెట్టులా నిలిచి చూపులవేర్లు దించి జీవనసారం సేకరిస్తాను
దినాంతాన నా పత్రాలు
సాయంత్రంలాగే రంగులుమారి చీకటిలో రాలిపోతాయి

మరొకరోజుని రాల్చుకొన్న చెట్టునయి
చీకటితో నల్లబడిన నదిలో నా ప్రతిబింబం జాడ వెదకబోతాను
చెట్టూ, నదీ, చీకటీ ఒకటే దిగుల్లోకి తమని కోల్పోతాయి

తమ స్వభావాలు మరిచి
తన ప్రతిబింబాలలోకి నది తానే ప్రవహిస్తుంది
చెట్టు ప్రతిబింబం చెట్టులోకి ప్రవహిస్తుంది
సమస్తాన్ని దాచవలసిన చీకటి సమస్తంలో దాగొంటుంది

జీవితం పసిపాప ఈ రోజునొక బొమ్మలా పట్టుకొని
ఇది కూడా నే కలగన్న బొమ్మకాదని శూన్యంలోకి విసిరేసి
చిరంతనశాంతిలో కొత్తబొమ్మని కలగంటుంది

*16.4.2013 రాత్రి 9.35*
*వాకిలి.కాం 17.5.2013*
*బ్లాగ్: 19.5.2013*

# నిద్రరాని రాత్రి

నిద్రరాని రాత్రి, గది తలుపులు తెరిచి
చలితో నింపిన గాలిబుడగవంటి ఆరుబయట నిలబడ్డాను

చుట్టూ చల్లదనం జీవితం తాకినట్టు తాకి వెళుతోంది
తల ఎత్తి చూస్తే చీకటిపుష్పం వెల్తురు పుప్పొడి రాల్చుతోంది
నాకూ, కాంక్షల్లా మెరిసే నక్షత్రాలకీ మధ్య సముద్రంలా పొంగుతోంది నిశ్శబ్దం
ఆకాశమూ, నేనూ దూరమైన తల్లీబిడ్డల్లా చూసుకొన్నాం ఒకరినొకరం

నాలో వజ్రాల్లా దాచుకొన్న ప్రశ్నలని
మళ్ళీ బయటకు తీసి చూసుకొన్నాను
సృష్టి అంటే ఏమిటి, నేను అంటే ఏమిటి
జీవితమంటే ఏమిటి, మృత్యువంటే ఏమిటి

జవాబు ఉందా వాటికి, నిజంగా అవసరమా
ప్రశ్నల తరువాత నాలో మేలుకొనే నిశ్శబ్దమే జవాబా
నిశ్శబ్దం నాలో ఉందా, నిశ్శబ్దంలో నేనున్నానా

చలికి ఒణికిన గాలితెర ఒకటి మళ్ళీ జీవితం తాకినట్టు తాకివెళ్ళింది
అద్దంలాంటి ఆకాశంలోకి ప్రశ్నలన్నీ పక్షుల్లాగా ఎగిరిపోయాయి

ఈ రాత్రి ఎంత బావుంది
ఈ చల్లదనమూ, ఆకాశమూ ఎంత బావున్నాయి
నక్షత్రాలూ, వాటి నడుమ ప్రవహించే నల్లనినదీ ఎంత బాగున్నాయి

వీటన్నిటినీ చూడటమెంత బాగుంది
చూడటమనే అనుభవాన్ని పంచుతోన్న జీవితమెంత బాగుంది

నిదురిస్తే మళ్ళీ మేలుకొంటానా, మరణిస్తే మళ్ళీ పుడతానా
ఇపుడే చూడగలిగినంత చూసుకోవాలి
నా మెలకువ నీటిబుడగని చాతనైనంత నింపుకోవాలి
ఈ విశాలమైన ఆకాశంతో, నక్షత్రాలతో, చలిగాలులతో
అన్నిటి వెనుకనుండీ దాగుడుమూతలు ఆడుతోన్న పసిపాపలాంటి జీవితంతో

*6.3.13 ఉదయం 3.20*
*'ఆదివారం' ఆంధ్రజ్యోతి దినపత్రిక 27.10.13*
*బ్లాగ్: 27.10.13*

# నీరెండ

మనస్సు నిండా చీకాకులతో మరొక ఉదయం మేలుకొన్నాను
తప్పూ, ఒప్పుల తీర్పులూ, వాటి వెనుక నా గర్వమో, నిగర్వగర్వమో
తన ఉనికి భద్రంగా ఉన్నందుకు చేసుకొనే పండుగా

తేనెతుట్టె కదిలినట్లు ఆలోచనల రొదలో, ఉన్నట్లుండి
ఇంటిగోడ మీద ప్రశాంతంగా పరుచుకొన్న నీరెండ ఆకర్షించింది
పసిపాప నవ్వులాంటి నీరెండ చీకాకుల ధూళి తుడిచి శుభ్రమైన అద్దాన్ని చేసింది

మనిషిలా ఎందుకు పుట్టాను, ఈ నీరెండలా పుట్టి
నీటిలోని ప్రతిబింబంలాంటి, నీటిమీది గాలి పలకరింపులాంటి
బహుపలుచని క్షణాలు గడిపి మాయమైతే సరిపోదా

. . .

ఏ యుగాలనాటిదీ నీరెండ
సోక్రటీసు ముఖంపై, బుద్ధుని చిరునవ్వుపై, వేల జ్ఞానుల ప్రవచనాలపై తేలి వచ్చిందే కదా
నా లోపలి గాఢాంధకారాన్ని రవంతైనా కదిలించని నీరెండే కదా

మళ్ళీ ఆలోచనలు, ఫిర్యాదులు, వాటివెనుక గంతులేస్తూ
చీకటిలో తనివితీరా స్వేచ్ఛ అనుభవించే ఒకే ఒక్క అహం ముల్లు

ఈ తీర్పులెప్పుడు ముగించాలి, ఈ బరువెలా దింపుకోవాలి
ఇప్పుడు చేరిన నీరెండని చూసిన గర్వం, పదాలలోకి ఒంపిన గర్వం ఎప్పటికి చెరగాలి

పదాలేమీలేని నగ్నమైన నీరెండ నెలా తాకాలి
క్షణంలో నీరెండలా మెరిసి ఎలా మాయం కావాలి, మాయమెలా కావాలి

*14.3.2013 ఉదయం 10.35 పత్రిక.కినిగె.కాం డిసెంబరు 2013  బ్లాగ్: 26.12.2013*

# నిద్ర నుండి నిద్రకి

నిద్రలేవగానే నీ ముందొక ఆకాశం మేలుకొంటుంది
వినిపించని మహాధ్వని ఏదో విస్తరిస్తూపోతున్నట్టు
కనిపించని దూరాలకు ఆకాశం ఎగిరిపోతూవుంటుంది

ఈ మహాశూన్యంలో నీ చుట్టూ దృశ్యాలు తేలుతుంటాయి
నీ లోపలి శూన్యంలో జ్ఞాపకాలు తేలుతుంటాయి
తేలుతున్న జ్ఞాపకాలు, తేలుతున్న ఇంద్రియాలతో
తేలుతున్న దృశ్యాలలో ఆట మొదలుపెడతాయి

ఇక బయలుదేరుతావు
కాంతినో, చీకటినో నీలో నింపుకొనేందుకూ
నీ చుట్టూ నింపేందుకూ

రోజు ఒక ఆకులా రాలిపోయే వేళవుతుంది
పండిన ఆకులా మలిసంధ్య రాలిపోయాక
మోడువారిన చీకట్లో నిన్ను వెదుక్కోవటం మొదలుపెడతావు

దిగులు నగారా ఎడతెగక మ్రోగుతుంది
జవాబుకోసం మేలుకొన్న నువ్వు
నిన్నటి ప్రశ్ననే ప్రక్కలోని పసిబిడ్డలా తడుముకొంటావు

ప్రశ్నరాలిన చప్పుడు వినకుండానే
ఎప్పటిలానే ఎక్కడికో వెళ్ళిపోతావు

*27.12.2013 ఉదయం 10.43*
*మాగజైన్.సారంగబుక్స్.కాం 9.1.2014 బ్లాగ్: 15.1.2014*

# దిగులు వాన

దిగులు గాలిపటం ఎగురుతోంది ఈ విరామసమయంలో
వాన కురిస్తే లోలోపలి తాపం ఆవిరై చల్లబడాలి కానీ,
ఈ దిగులు మాత్రం దారిలోని కుక్కపిల్లలా నాతోనే తిరుగుతోంది

ఎందుకనో 'ఆకాశమా, దు:ఖించకు' అనాలనిపిస్తోంది
మననెవరూ ఓదార్చనపుడు, మనకెవరినో ఓదార్చాలనిపిస్తుంది

ఎంత బరువుగా వుందీ విరామం
ఈ ఖాళీ దాచుకొని పనివేళల ఉపయోగిస్తే బావుండును

ఏదో ఒకటి చేయాలి, నన్ను నేను తప్పించుకోవాలి
కురిసే కురిసే వానని ఊహతో ఆపే ప్రయత్నం చేయాలి

సంగీతమో, కవిత్వమో దేనికైనా ఈ దిగులు సరైన సమయం
అన్నీ విడిచి ఈసారైనా దిగులు గర్భంలోకి సరాసరి దూకాలి
ఏ సృష్ట్యాది వెల్తురులు దాగివున్నాయో చూడాలి

ఏమీ లేకపోవటమైనా అక్కడ ఉండకపోతుందా
అంతూ, దరీ లేని స్వేచ్ఛ ముంచేయకపోతుందా
నిజమైన వాన ఏదో నన్ను చినుకుని చేసి ఎటైనా విసిరేయకపోతుందా

*15.7.2012*
బ్లాగ్: *15.7.2012*

# ఒంటరితనంలోకి..

అందరూ ఉన్నట్లే వుంటుంది, అకస్మాత్తుగా ఒంటరితనం పరుచుకొంటుంది
డాబామీది పావురాయి రెక్కల్నీ, కువకువల్నీ, నీడనీ వెంటపెట్టుకొని ఎగిరిపోతుంది
పావురాయి ప్రపంచం ఖాళీ అయినచోట శూన్యం సుడితిరుగుతూ తనలోనికి లాగేస్తుంది
లోకం ఎప్పట్లా మరోసారి దు:ఖమయమై కనిపిస్తుంది

నీతో ఏంపని చెట్లకీ, పిట్టలకీ, వాటిపై అలుపెరుగక ఎగిరే ఆకాశానికీ,
మనుషుల నీడలకీ, గోడలకీ, తలక్రిందుల తెలివికీ అనిపిస్తుంది

శుభ్రమైన శ్వాసలా బ్రతకాలని తలుస్తూనే
కాలంకాని కాలంలోకి తొందరపడి జారిపడిన
పురా స్వప్నస్మృతి ఒకటి, దు:ఖపువాగులో గులకరాయై మెరుస్తుంది

ఇక్కడందరూ వున్నట్లుంటుంది, వెచ్చగా కప్పినట్లుంటుంది
ఎవరిలోనికి తేమచూపును పంపినా,
వేసవిగాడ్పు వినా, పచ్చని ఆకైనా ఎగిరిన జాడలుండవు

. . .

దట్టమైన పొగమంచులా కమ్ముకొంటోంది ఒంటరితనం
అగాధమైన నిశ్శబ్దంలోకి అన్వేషణ తెరచాపయెత్తి ఎలా ప్రయాణించాలో
ఇప్పుడెవరు చెబుతారు..

*21.8.2012*

*బ్లాగ్: 4.6.2015*

# తెరిచినవేళల

ఇంటికి చేరి తలుపులు తెరుస్తున్నపుడు
జీవితమంతా తెరిచినవన్నీ గుర్తుకొస్తాయి

తెరిచిన పుస్తకాలు, స్నేహాలు
తెరిచిన మాటలు, నవ్వులు, కన్నీళ్ళు
తెరిచిన పగళ్ళు, రాత్రులు
భూమ్మీద నీకు నువ్వుగా తెరిచిన నీ జీవితం

ప్రతిదీ తెరిచినపుడల్లా పూలరేకుల్లాంటి వెన్నెల
నీలో తాజాగా రాలటం గుర్తిస్తావు

తెరవటంలో సంతోషంవుంది గనుకనే
సృష్టి నిరంతరం తెరుచుకొంటోంది
ఎల్లలులేక జ్ఞానం విస్తరిస్తోంది

కానీ, తెరుచుకొన్నవి నీ వెనుకనే మూసుకుపోవటం చూసినపుడు
నీడలాంటి విషాదం నీలో పరుచుకొంటుంది
బహుశా, అందుకనే లోనికి వచ్చి తలుపులు మూసే ప్రతిసారీ
నిలువెత్తు నిస్పృహ కమ్ముకొంటుంది

తెరుచుకొన్న మెలకువ నిద్రలోకి ముడుచుకొనే ప్రతిసారీ
ఎప్పటికీ వికసించే తెలియనిలోకానికి యాత్ర మొదలౌతుంది

*12.12.2014 ఉదయం 11.03*

*బ్లాగ్: 25.8.2014*

# సంకెళ్ళు

ఈ సంకెళ్ళని త్రెంచుకోవాలని ప్రయత్నించావు చాలాసార్లు

కుదురుగా బ్రతికితే వదులౌతాయని చూసావు
అవి కూడా కుదురుగా వున్నాయి కాని, వదులుకాలేదు
మర్యాదల సరిహద్దులు దాటి విదిలించుకొన్నావు
చర్మం చిట్లింది కాని, వీలు కాలేదు

దయగల స్త్రీ ఎవరైనా మృదువుగా తొలగిస్తుందనుకొన్నావు
ఇనుపసంకెళ్ళు లతలయ్యాయి కాని, వీడిపోలేదు
కవుల లోకాల్లోకి చేతులు చాపి మాయం చేయాలనుకొన్నావు
ఊహల మంచు విడిపోగానే మరింత మెరిసాయి

జ్ఞానుల స్వేచ్ఛాగీతాలని అనుసరించి సంకెళ్ళే లేవని ధ్యానించావు
ధ్యానంలోంచి భూమ్మీదికి రాగానే మరింత బరువయ్యాయి
సంకెళ్ళున్నాయి, తెంచుకొనే వేదన వుంది
ఇక, వాటిని భరిస్తున్న నువ్వెవరో తెలుసుకొని తీరాలి

ఎదురుచూడని సమయంలో
ఊహకందని వైపు నుండి విచ్చుకొనే కిరణమేదో
ఉండీ, లేని బహిరంగ రహస్యంలోకి నిన్ను తెరవాలి

*26.3.2014 మధ్యాహ్నం 2.13*
*తెలుగు.వన్ఇండియా.ఇన్ 24.6.2014*
*బ్లాగ్: 25.6.2014*

# దు:ఖం లోపలికి

ఒక్కొక్క తలుపూ మూస్తూ చీకటితెరలు కప్పుకొన్నాను
పదేపదే రాబందులా వాలే దు:ఖాన్ని మృదువుగా, ప్రశాంతంగా గమనిస్తున్నాను
దు:ఖమంటే ఏమిటో, అది లోకంలో ఎందుకుందో తెలీదు
మూసినగదిలోకి చీకటిలా మూసుకొన్న హృదయంలోకి ఎలా చేరుతుందో తెలీదు

పాలపుంతల నడుమ వెలుతురుని పీల్చుకొనే కృష్ణబిలాల్లా
సమస్త సుఖశాంతుల్నీ పీల్చివేసే దు:ఖం వుంది
సుఖదు:ఖాలు లోపలి రసాయనచర్యలా, నాపై క్రీడించే మహాశక్తులా
కాదేమో, తెలీదు. అవునేమో, తెలీదు.

నేను దు:ఖంలో వున్నాను, దు:ఖం, నేనూ ఒకటై వున్నాము
నేనిపుడు దు:ఖాన్ని, చీకటిని
సమస్తం నుండీ ముడుచుకొంటున్నవాడిని, నన్ను దాచుకొంటున్నవాడిని
మరింత ఘనీభవిస్తున్న శిలాజాన్ని, సాంద్రమవుతున్న జీవితాన్ని

జీవితం లోలోనికి దు:ఖపు వేర్లు దింపి
రాగల ఆకాశంలో ఆకుపచ్చని కాంతిలా ఎగసే ఆనందాన్ని
ఘనీభవించిన చీకటి ద్రవించి ఆవిరై విహరించే కాంతిని

నేను ఇపుడు.. పగటినీ, రాత్రినీ నిశ్శబ్దంగా మోస్తున్న ఆకాశంలా
ఆనందాన్నీ, దు:ఖాన్నీ నిశ్శబ్దంగా దర్శిస్తున్న రహస్యస్పృహని

*2.12.2012 ఉదయం 9.20*
*బ్లాగ్: 5.5.2013*

# జీవితం ఇలాగే

జీవితం ఇలాగే వుంటుంది
ఊహలు కూడా ఆవిరైపోయే నడివేసవి మధ్యాహ్నపుటెండలా వుంటుంది
స్వచ్ఛప్రవాహం మధ్య సగం మునిగీ, సగం మేలుకొన్న శిలలా,
చిన్నపుడు విప్పలేక వదిలేసిన పొడుపుకథలా,
నిన్ను నీకు మిగలనివ్వని కీచురాయి అరుపులా వుంటుంది

జీవితమింతే, ఇది వానలో చిక్కుకొన్న ఇంద్రధనువు
యుగాలుగా నిశీథిలో వ్రేలాడే ఒంటరినక్షత్రం

ఇది తల్లి ప్రక్క నిద్రించే బిడ్డ మనస్సులా నిర్భయంగా వుండదు
శూన్యం ముఖంలో ముఖంపెట్టి ఆడుకొనే పూవులా అమాయకంగా,
ప్రేమికుల మొదటి నిష్కపట స్పందనలా తాజాగా వుండదు
సృష్టి అంతా దైవమనే జ్ఞాని హృదయంలా పవిత్రంగా,
నిజాయితీగా వున్న క్షణాల్లో వెలిగే నిజమైన మనశ్శాంతిలా వుండదు

జీవితమింతే, ఇది ఒక దిగంబర దేవత
నిన్ను రమ్మనదు, పొమ్మనదు, ఇది కావాలనదు, వద్దనదు
మతిలేని యాచకురాలి నవ్వులా నీ కలలన్నిటినీ కోసుకొంటూ తరలిపోతుంది

నీ నమ్మకాలనీ, భయాలనీ, బంధాలనీ ఎటో విసిరేస్తుంది, మరలా ప్రోవుచేసి చూపిస్తుంది
నువ్వు నిద్రపోదామనుకొంటే, గోల చేసి లేపుతుంది
మేలుకొందామనుకొంటే, జోలపాడి తలనిమురుతుంది

రానన్నా బడికి లాక్కెళ్ళిన చిననాటి వెంకన్నలాంటిది జీవితం

శూన్యంలో ప్రవేశించిన శూన్యంలా ఇక్కడ గడపక తప్పదు
శూన్యంనుండి నిష్క్రమించే శూన్యంలా ఇక వెళ్ళక తప్పదు

ఎవరైనా, ఇలా బ్రతకాలని నేర్పి పంపితే బాగుండును
ఎలా బ్రతకాలో మనకైనా అర్థమయేసరికి
చుట్టూ వున్న సర్కసు డేరా, జంతువులూ, కోలాహలమూ మాయమైపోతాయి

*22.2.2012*
*'ఆదివారం' ఆంధ్రజ్యోతి దినపత్రిక 17.6.2012*
*బ్లాగ్: 17.7.2012*

# ఇందుకేనా

నాలుగుగోడల మధ్య విసిరేసిన బంతిలా
ఇక్కడిక్కడే తిరుగుతాయి నీ ఊహలు
అదే ఉదయంలోకి మేలుకొంటూ, రాత్రిలోకి నిద్రపోతూ
ఒక్కరోజునే వందేళ్ళు బ్రతికి వెళ్ళిపోతావు

ఇందుకేనా పుట్టింది, జీవితం ఇంత ఇరుకా అని
అడుగుతావు కనబడ్డవాళ్ళందరినీ
ఒక్క మనిషిలాంటి వేలమనుషులు
ఒక్క జవాబైనా ఇవ్వకుండా వెళ్ళిపోతారు

ఈమాత్రానికి చీమై పుట్టినా సరిపోయేది కదా
పూవై పుట్టినా మరింత బావుండేది కదా అని
నిన్ను నువ్వే నిలదీసుకొంటావు

. . .

రాలిపోతుంటాయి ఉదయాలూ, అస్తమయాలూ
రాలిపోతుంటాయి వెన్నెలలూ, నక్షత్రాలూ
రాలిపోతుంటాయి వానచినుకుల్లానో, ఎండుటాకుల్లానో
రుతువులూ, కోరికలూ, బాంధవ్యాలూ

జారిపోతున్న దిగులుదుప్పటిని ముఖమ్మీదికి లాక్కొంటూ
ఇందుకేనా పుట్టిందని
ఎవరిలోంచో ఎవరిలోకో అడుగుతుంటావు నువ్వు

కాస్త శాంతీ, చిరునవ్వూ మినహా మరేమీ వద్దని
కాస్త ఊరటా, ధైర్యం కాక ఇంకేం కావాలని
ఊరికే సుడి తిరినట్టు నీలో నువ్వు తిరుగుతుంటావు

. . .

చీకటి ఆకాశంలో మేఘంలా దు:ఖం చిక్కబడినపుడు
నీటిలోని సుడిగుండం లోతుల్లో నీరేమీ మిగలనపుడు
పీడకలలాంటి వెలితిలోకి నీ ప్రశ్న నిన్ను విసిరేసినపుడు
తటాలున ఉలికిపడి మేలుకొంటావు
జవాబు దొరకదు కానీ, ప్రశ్న మాయమౌతుంది

ఉదయాస్తమయాలూ, వెన్నెలలూ, రుతువులూ
దిగుళ్ళూ, ఊహలూ, ప్రశ్నలూ అన్నిటికీ అర్థంవుందని,
అర్థాలకి అందని ఖాళీ ఆనందాన్ని
అవి ప్రకటిస్తూ, మాయమౌతున్నాయని
నీలోపల మేలుకొన్న సిద్ధార్థుడు చెప్పగా వింటావు

*2.5.2014 మధ్యాహ్నం 1.45*
*'వివిధ' ఆంధ్రజ్యోతి దినపత్రిక 9.6.2014*
*బ్లాగ్: 9.6.2014*

# అదేంకాదు కానీ..

అదేంకాదు కానీ, కొంచెం నిర్లక్ష్యంగా బ్రతకాలి
దిగంబరా లేచిరా అంటే దిగ్గున నిలబడ్డ బైరాగిలా
ఆకాశం తప్ప మరేమీ అక్కర్లేని అవధూతలా
గాలిపడవ తెరచాపై ఎగిరే ఎండుటాకులా నిర్మోహంగా నిలవాలి
దేనిలోంచీ దేనిలోకీ నాటుకోని అలలమీది ఆకాశబింబాల్లా తేలికగా చలించాలి

ఏముందిక్కడ మరీ అంత బాధపెట్టేది
మరీ అంత లోతుగా ఆలోచించవలసింది

మర్యాదలన్నీ గాలి కొదిలేసి చూడాలి
భుజమ్మీది బాణాల్నీ, లక్ష్యాల్నీ మరపు మైదానంలో విడిచిరావాలి
వేటినీ మోసేందుకు మనం రాలేదనీ
ఏకైక జీవనమహాకావ్యం మననే ఓ కలలా మోస్తోందనీ
నీటిబుడగ చిట్లినట్లు చటుక్కున స్ఫురించాలి

అదేంకాదు కానీ, జీవితాన్ని జీవితంలా ప్రేమిస్తూ బతకాలి
అవమానాలూ, ఆందోళనలూ అట్లా ఓ ప్రక్కకి విసిరేసి
లోకంలో నాటుకున్న నాటకవిలువలు చూసి జాలిజాలిగా, సరదాగా నవ్వాలి

ఏముందిక్కడ మరీ అంత పొంది తీరవలసింది
పోగొట్టుకుని గుండెచెదిరి రోదించవలసింది
దిగులు సాలెగూళ్ళన్నిటినీ చిరునవ్వు కుంచెతో శుభ్రంచేసి
విశాలమైన ఆకాశాన్ని చిత్రించి చూడాలి

చూడాలి, ఆకాశం నిండా ధగధగలాడే ఎండ సంరంభం
వానబృందం ప్రదర్శించే సంగీతనృత్యరూపకం
చలిరాత్రుల వికసించే గోర్వెచ్చని ఊహల పరీమళోత్సవం

అదేంకాదు కానీ, జీవితం లోపలి దృశ్యాలన్నీ బరువెక్కినప్పుడైనా
జీవితమే ప్రతిబింబం కావటంలోకి కనులు తెరవాలి

*6.6.2014 ఉదయం 11.58*
*మాగజైన్.సారంగబుక్స్.కాం 18.9.2014*
*బ్లాగ్: 25.9.2014*

# ఎవరెవరు..

ఎవరెవరు వెళ్ళిపోదలచారో వెళ్ళనివ్వు జీవితంలోంచి
వెళ్ళిపోవటాలు చూడటానికే నువ్వొస్తావు

ఒకానొక కాలం నిన్ను వాకిలి చేసి నిలబెడుతుంది
ఎవరెవరో పని ఉన్నట్టే నిన్ను దాటి హృదయంలోకి వస్తారు, లోపల వెదుకుతారు
వాళ్ళు నీవాళ్ళని అనుకొంటూ వుండగానే
ఇక్కడేమీ లేదు, అంతా ఖాళీ అని గొణుగుతూ వడివడిగా వెళ్ళిపోతారు

నిజమే, ఖాళీలలో ప్రవేశించే ఖాళీలు
ఖాళీలలోంచి బయటికి నడిచే ఖాళీలు
ఖాళీ అనుభవాలతో లోపలి ఖాళీ నింపుకోవాలనే వెర్రివ్యాపకమొకటి
వేసవికాలపు వేడిగాలై సుడితిరగటం మినహా, నిజానికి ఇక్కడేమీ లేదు

వెళ్ళనీ ఎవరు వెళతారో, త్వరగా, మరింత త్వరగా
ఎగరబోతున్న పక్షిరెక్కల్లోంచి జారిపోతున్న తూలికలా
అరచేతుల్లో వాలి మాయమైపోతున్న ఉదయకిరణంలా
మేలుకోగానే తెలియరాని మైదానంలోకి రాలిపోయిన కలలా

ఓ దీర్ఘశ్వాస తీసుకొని, హాయిగా విడిచేయి శ్వాసనీ, మనుషుల్నీ
స్వప్నసరోవరంలోకి హంసల్ని విడిచినట్లు సుతారంగా, తేలికగా..

*14.9.2014* మధ్యాహ్నం *1.00*
పత్రిక.కినిగె.కాం *13.10.2014*
*బ్లాగ్: 27.11.2014*

# పునరుత్థానం

ఒక గాయం ఎటూ కదలనివ్వక
నిలబడినచోటనే కూలబడేలా చేస్తుంది
చూస్తున్న దిక్కులోని శూన్యంలోకి
వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపొమ్మంటుంది

గాయం ఏమీ చెయ్యదు,
అప్పటివరకూ అల్లుకొన్న తెలిసీ, తెలియని స్వప్నాలనీ
స్వప్నాలకి సుతారంగా పూయబోతున్న సంతోషాల పువ్వులనీ
చిందరవందర చేయడం మినహా
పాలుగారే వెన్నెలల్నుండీ, ఉభయసంధ్యల వర్ణాలనుండీ
సేకరించుకొన్న జీవనలాలసని ఒకేసారి చెరిపేయడం మినహా

ఇన్నాళ్ళూ పాడింది పాటే కాదు, మళ్ళీ మొదలుపెట్టు
భూగోళమంత జీవితాన్ని నీపై మోపుతున్నాను,
ఆకాశంలా ఎగిరిచూపించు అంటుంది గాయం

జీవితోత్సవాన్నుండి వేరుపడ్డ హృదయం
తడిసి మెరిసే మాటకోసం, చూపుకోసం, స్పర్శకోసం
తప్పిపోయిన పిల్లాడిలా ఎడతెగక ఎదురుచూస్తుంది

దారులన్నీ మూసుకుపోతున్న చీకట్నుంచి చీకట్లోకి
దు:ఖజలంతో బరువెక్కుతున్న కాలంనుంచి కాలంలోకి
ఉన్నచోటనే వేళ్ళూనుకొంటున్న గాయంతో వేచివుంటుంది

దైవీశక్తులేవో దీవించిన స్ఫటికంలాంటి క్షణమొకటి ప్రవేశిస్తుంది
ఉన్నట్లుండి ఒక నిట్టూర్పు గుబురుకొమ్మల్లోంచి పక్షిలా ఎగురుతుంది
కాసిని కన్నీటిమొగ్గలు చెక్కిళ్ళపై పొరాడుతాయి

ఎక్కడిదో నీళ్ళచప్పుడూ, పక్షిరెక్కల అలికిడీ
చెట్ల ఆకుల్ని గాలి మృదువుగా నిమిరిన మర్మరధ్వనీ
చెవిలో జాగ్రత్తగా గుసగుసలాడుతాయి

జీవితం చాలా పెద్దది, చాలా దయగలది కూడా
ఊరికే నిలబడు, ఒక అడుగువేయి
తక్కినదంతా తను చూసుకొంటుంది

లేతమొక్కలా కూలిపోయిన నీవు
నిలబడతావు, నిలబడతావు
ఒక మహావృక్షపు ఛాయను నీ వెనుక చిత్రించుకొంటూ
మేఘాలు నుదుటిని చుంబించేవరకూ నిలబడుతూనే వుంటావు

*28.9.2014 మధ్యాహ్నం 12.23*
*ఈమాట నవంబర్ 2014*
*బ్లాగ్: 2.12.2014*

# విహంగదర్శనం

జీవితమొక మహా విహంగం
దాని రెక్కలు విప్పినపుడు అది పగలు, మూసినపుడు రాత్రి
ఆ పక్షిని దర్శిస్తున్నపుడు 'నేను' ఎక్కడ వుందో తెలియటంలేదు
నేను ఉన్న ఈ సృష్టి ఎక్కడ వుంది

ఊహకందని విహంగం నా ద్వారా శ్వాసిస్తోంది
నా కనుల ద్వారా చూస్తోంది, నా నిద్రలో విశ్రాంతి పొందుతోంది

పొదుపుగా దాచుకొన్న ఊహలన్నీ ఎండమావులని గ్రహించాక
నేను నేను కాననీ జీవితాన్ననీ తెలుస్తోంది
ఇప్పుడు నేనొక మహా విహంగం
వెలుతురు నా కల, చీకటి నా విశ్రాంతి

నేను ఎక్కడ ఉన్నానో, ఎప్పుడు మొదటిసారి రెక్కలు విప్పానో
ఎందుకు, ఎక్కడికి వెళుతున్నానో ఎప్పటికీ రహస్యం
రహస్యం నా నివాసస్థలం
నేను మహా విహంగాన్ని, నేను జీవితాన్ని

*10.8.2012*
బ్లాగ్: *30.8.2012*

# బ్రతకాలి

నువ్వు లోకాన్ని లోపలికి తీసుకొంటున్నపుడు
అది నిన్నూ లోపలికి తీసుకొంటుంది
నిశ్చలతటంలోకి దిగినట్టు లోకంలోకి దిగుతావు కానీ
నీటి అడుగున వేచివున్న మొసళ్ళని ఊహించలేవు

ప్రతి గెలుపూ, పరాజయమూ
జీవనానందం నుండి మరికాస్త దూరంచెయ్యటానికి వస్తాయి
కీర్తి ఒక వజ్రంలా ఆకర్షిస్తుంది కాని
దానిని మ్రింగినపుడు ప్రాణం తీయటం మొదలుపెడుతుంది

జీవితం ఇటువంటిదని ఎవరూ చెప్పరు
జీవితం కానిది వదులుకొంటే జీవితమే మిగులుతుంది
వెళ్ళిపొమ్మని నిన్ను ఊపేస్తున్న భావాలన్నీ
జీవితపు నీడలే కాని, జీవితం కాదు

జీవితం తనని తాను చూసుకొనేందుకు
నిన్ను కన్నది కానీ, నువ్వేదో చేసి తీరాలని కాదు
ఏదో చెయ్యటానికే అన్నీ ఉండాలనుకొంటే
ఏదీ చెయ్యని ఆకాశం ఏనాడో మాయమైపోయేది

జీవించడమంటే మరేం కాదు
గాలిలా, నేలలా, నీటిలా ఊరికే ఉండటం
ఉండటమే ఉత్సవమైనట్టు ఉండటం
మిగిలిన పనులన్నీ నిద్రపోయాక నీ ప్రక్కలో ఒంటరివైన ఆటబొమ్మలు

*9.1.2014 ఉదయం 11.15 నవ్య వారపత్రిక 7.5.2014 బ్లాగ్: 2.5.2014*

# మార్మిక కవిత్వం

మనిషిలో కోరికల ఫలవృక్షముంటుంది, ప్రపంచం దాని నీడ
సదా మానవులు నీడలకు వ్రేలాడే కాయల్ని త్రెంచబోతారు
అరుదుగా, వివేకం మేలుకొన్నవాడొకడు
వృక్షాన్ని చెరిపేసి, తానే రసపూర్ణ ఫలమని తెలుసుకొంటాడు

. . .

అప్పుడే నడక నేర్చిన పిల్లల్ని పాదాలు నడిపిస్తాయి
మాటలు నేర్చిన పిల్లల్ని పదాలు మాట్లాడిస్తాయి
ఊహలు నేర్చిన పిల్లల్ని ఉద్వేగాలు జీవింపచేస్తాయి

నడక తెలిసినవాడు పాదాలను నడిపిస్తాడు
సంభాషణ తెలిసినవాడు పదాలని ఉపయోగిస్తాడు
ఊహలు తెలిసినవాడు ఉద్వేగాల్ని నియంత్రిస్తాడు

. . .

వేటినీ లోనికి రానీయకపోవటం తొలిదశ
అన్నిటినీ రానీయటం మలిదశ
అన్నిటినీ వెలుపలికి పోనీయటం మరోదశ
రాకపోకలూ, లోవెలుపలలూ లేవని తెలియటం చరమదశ

. . .

వెలుపలి ప్రపంచమొక పర్వతం, లోపలి ప్రపంచం అగాధం
పర్వతంపై ఎవరూ ఒక అడుగైనా పైకి వేయలేరు
అగాధంలోకి ప్రవేశించేవారు పర్వతాన్ని అధిరోహిస్తారు
అగాధం లోతులు తాకినవారు, పర్వతాగ్రంపై కనిపిస్తారు

. . .

సృష్టి ఒక పర్వతం, కాలమొక వలయం
నిద్రాతప్త మానవులు పర్వతపాదంలో ప్రదక్షిణ చేసి వెళ్ళిపోతారు
స్వప్నసంచారులు కొంత అధిరోహించి వలయంగా తిరుగుతారు
వారు ఇతరులు వర్షించే ఆశ్చర్యంతో సంతృప్తులై మరలిపోతారు

అరుదుగా ఒకరు నిటారుగా నడవటమే నడవటమని గ్రహిస్తారు
వారొకమాటైనా లేకుండా శిరసువంచి శిఖరాగ్రానికి పయనిస్తారు
పైన నిలిచి పర్వతమే పరిభ్రమించటం దర్శిస్తారు

*1.3.2012*
*నవ్య వారపత్రిక 2.5.2012*
*బ్లాగ్: 30.7.2012*

# అద్వైతం

దృశ్యాలు ఆనందాన్నిస్తాయి కాని
మరింత లోతైన ప్రశ్నల కిరణాలు ప్రకాశిస్తే
అవి పొగమంచులా మాయమవుతాయి

దృశ్యాలు బాధ కలిగిస్తాయి కాని
మరింత సున్నితమైన ప్రేమలోకి కనులు తెరిస్తే
అవి దయగా నిన్ను విడిచి వెళ్ళిపోతాయి

. . .

సమస్త దృశ్యాల మహాదృశ్యమేదో తనకి నచ్చినట్లు చలిస్తోందనీ
నీ చిన్నారి సంవేదనల దేహం దానిలో భాగమనీ తెలిస్తే
నువ్వు జీవితాన్ని మోయటం అంతమై
నిన్ను జీవితం మోయటం మొదలవుతుంది

. . .

మరింత లోతైన శ్వాసలోకి
నీ జీవితపు వేర్లు ప్రవేశించినపుడు
ఏ చిరుగాలీ ఇక చలింపచేయదు
ఏ పెనుగాలీ కదిలించలేదు

కదలికలేని బ్రతుకెందుకనే ప్రశ్న
నీలో కదులుతుంది కానీ
బ్రతుకొక నిశ్చల పర్వతమనీ, కదలిక మృత్యువనీ
నీలో కదలని దొకటి మౌనంగా చెబుతుంది

. . .

నీ చుట్టూ ఏదీలేని స్వేచ్ఛ
నువ్వు ఏదీకాని స్వేచ్ఛ
అంతకన్నా రసమేది, సౌందర్యమేది
అంతకన్నా ధైర్యమేది, శక్తియేది

అన్యమేమీ కనరాకుండా హత్తుకోవటం కన్నా
ప్రేమ ఏది, పవిత్రమేది, నిండుదనమేది

*5.4.2015* ఉదయం *11.58*

# స్వేచ్ఛకి దారులు

ఎంతో తెలుసుకోవాలి, అంతా మరిచిపోవాలి
తెలుసుకొంటున్నపుడు చూపు విశాలమవుతుంది
మరిచిపోతున్నపుడు స్వేచ్ఛ పొందుతుంది

విశాలం కావటానికి తెలుసుకోవాలి
మరింత విశాలం కావటానికి మరిచిపోవాలి
తెలుసుకొంటూ, మరిచిపోతూ మరింత స్వేచ్ఛలోకి మేలుకోవాలి

ఎన్ని బంధాలనైనా ప్రేమించాలి, అన్నీ విడిచిపెట్టాలి
ప్రేమిస్తున్నపుడు నీ ఉనికి విస్తరిస్తుంది
విడిచిపెట్టినపుడు అగాధమైన వెలితి ఏకాంతయాత్రికుని చేస్తుంది

ఏకాంతంగా ఉండటమంటే స్వేచ్ఛగా ఉండటం
యాత్రికుడు కావటమంటే జీవించటాన్ని ప్రేమించటం

జీవితం ఒక బందీ ఆలపించే స్వేచ్ఛాగీతం
అతని ఉనికే బంధం, అతని చుట్టూవున్న అనంతాకాశం స్వేచ్ఛ
అతన్ని పక్షిని చేసే మంత్రవిద్య పాట

అతను పాడుతూ, పాడుతూ పక్షిలా మారిపోతాడు
పక్షి ఎగురుతూ, ఎగురుతూ అనంతాకాశంలో బిందువై, ఆకాశమై కరిగిపోతుంది

*3.10.2012*
*బ్లాగ్: 29.7.2014*

# వర్తమానంలోకి

రాలిపోయిన రాత్రివంటిది గతం, రానున్న రాత్రిలాంటిది భవిత
ఈ పగటివంటి వర్తమానం ఊగుతోంది గాలిరేకులతో

రాత్రులకైనా నల్లని రంగుంటుంది
మృదువిషాద పరిమళముంటుంది, విరామంలోకి వికసిస్తూవుంటుంది
ఏ రంగూ, వాసనా లేని గతమూ, భవితా
ఊహల్లో మాత్రమే ఉనికిని పాతుకునుంటాయి
జీవితమంతా వెంటాడినా వేలికొనకు క్షణం దూరంనుండి వెక్కిరిస్తాయి

గతం జీవన శిధిలాలయం, భవిత గాలిలో తేలే నగరం
కూలిన గోడల్నీ, పునాదిలేని భవనాల్నీ ప్రేమించేవాళ్లని ప్రేమించనీ
మిత్రుడా, మనం ఈ క్షణమై స్పందిస్తున్న అనంతాకాశంక్రింద నిలిచి
కాలం మీటే నిశ్శబ్ద సంగీతాన్ని విందాం

కాంతిబీజమేదో వికసించి కిరణాలు వెదజల్లినట్లు
ఆనందం వికసించి అన్నివైపులకీ పరిమళిస్తోంది జీవితం

సులువుగా మేలుకొందాం ఇపుడే
నిత్యవర్తమానంలోకి, పసిదనంలోకి, జీవించటంలోకి
మరణాన్నెరుగని బహిరంగ రహస్యంలోకి
చిరునవ్వులోకి, చిరంతనశాంతిలోకి, ఏదో ఒకటై మిగలకపోవటంలోకి..

*9.10.2012*
*'వివిధ' ఆంధ్రజ్యోతి దినపత్రిక 29.10.2012*
*బ్లాగ్: 30.10.2012*

# ఒక దారి

నువ్వు ఇంటిలో వున్నావు
ఇల్లు నీ ఊరిలో, ఊరు భూమ్మీద
భూమి పాలపుంతలో, పాలపుంత అనంతంలో

మధ్యలోని గీతల్ని మరిచిపోయి గమనిస్తే
నువ్వు అనంతంలో ఉన్నావని కనుగొంటావు

నీ దేహాన్ని కట్టుకొని లోపల వెలిగే పక్షి అద్భుతమైనది
రెండుకళ్ళ రెక్కల్ని ఎంత చాపితే అంతకు అంతై విస్తరిస్తుందీ పక్షి
నువ్వు చీమని చూస్తే చీమవి, అనంతాన్ని చూస్తే అనంతానివి

అనంతం తరువాత ఏముందని అడిగేందుకు లేదు
మాట చేరగలిగే ఆ చివరిచోటికి చేరుకొంటే
చూపుకాని చూపులోకి రాలిపోతావు

*20.6.2014* మధ్యాహ్నం *12.20*
బ్లాగ్: *31.8.2014*

# సంకేతాలు

గర్భంలో ప్రశ్నార్థకంలా జీవం నింపుకొంటాము
భూగోళం బిందువుపై ఆశ్చర్యార్థకమై జీవిస్తాము
జవాబునిచ్చే వాక్యంలా మేనువాల్చి మరణిస్తాము

ప్రశ్న జీవం నింపుతుంది
ఆశ్చర్యం జీవింపచేస్తుంది
జవాబు మృత్యువవుతుంది

మృత్యువంటే ఏమిటనే ప్రశ్న
జవాబు తరువాత మిగిలే ఖాళీకాగితంలా
ఎప్పుడూ ఆశ్చర్యపరుస్తుంది

*13.04.2013 ఉదయం 11.25*
*బ్లాగ్: 3.6.2015*

# అలా ఆకాశం వరకూ..

నిద్రలేవవలసిన ఒక ఉదయం నీ దేహం చల్లబడి ఉంటుంది
ఎలా బ్రతికావో బ్రతికావు, ఇక పూర్తయిపోయింది
దేహం చుట్టూ ముసిరే దు:ఖానికి దూరంగా ఎక్కడో వుంటావు

ఇక ఉంటావో, ఉండవో ఎప్పటికీ రహస్యమే
వెళ్ళిపోయాక, ఈ ఐదుశక్తుల ఆట కొనసాగుతుందో, లేదో సందేహమే

ఎక్కడో నువ్వూ, ఇక్కడ ప్రపంచమూ ఇంకా ఉంటారనుకోవటం
కలవంటి జీవితానికి అందమైన సరిహద్దులు మాత్రమే
చివరకు మిగిలేదేమిటో తెలిసిందెవరు, వారిలో తెలుసుకొనేదెవరు

. . .

జీవితం భయ, విషాదాలలో పొరలే పాత్రను తలదాల్చి నర్తించే కళ
గెలిచేందుకు ఏ నియమాలూ లేని, గెలిచే హామీలేని నవ్వుకొనే క్రీడ

ఎన్నాళ్ళని భూమిపై ఎగుడుదిగుడు నడక
ఆడటం అనివార్యమైతే నక్షత్రాలతో ఆడిచూడాలి
నాట్యం తప్పనిసరి అయితే పాలపుంతలు వేదిక కావాలి
వెళ్ళటం తప్పదనిపిస్తే ఉన్నన్నాళ్ళు సమస్తాన్ని పొదువుకొన్న ఆకాశమైపోవాలి

. . .

ఏమో ఎవరికి తెలుసు
నక్షత్రాలూ, పాలపుంతలూ అద్దంలో ప్రతిబింబంలా అదృశ్యం కావచ్చును
అద్దంలాంటి ఆకాశం మాయం కాకుండా మిగలవచ్చును

రా నడుద్దాము అలా ఆకాశం వరకూ
ఈ దారి కొసన నేలవాలి తనతో రమ్మని పిలుస్తోంది
తీరా వెళ్ళేసరికి పక్షివలే ఎగిరిపోతుందనకు
మన అమాయకత్వాన్ని కాదనలేక అది ఎదురుచూడవచ్చును
ఈ పసిమనసులు వికసించి ఆకాశంతో ఎగరవచ్చును

నాతో రా ఒకసారి, ఆకాశంలా మారి చూద్దాము
వెళ్ళిపోయాక ఆకాశమై మిగిలేదీ, లేనిదీ చూసివద్దాము

. . .

ఇంతకూ, పుట్టక ముందు ఎక్కడ ఉండేవాళ్ళమో
ఈ సారి ఆకాశాన్ని కలిసినపుడు తప్పక అడగాలి

*19.8.2012*
పాలపిట్ట డిసెంబరు *2012*
బ్లాగ్: *21.12.2012*

# శూన్యక్షణాల్లోకి

ఉత్సాహాన్ని మాటల్లోకి ఒంపుతున్నపుడు సాలెగూటితో మన దారం తెగిపోతుంది
చతురస్రదృశ్యంలో మునిగితేలుతున్నపుడు విద్యుత్తు నల్లటివిరామం ప్రకటిస్తుంది
కన్నూ, దృశ్యమూ యుగళగీతంలో మైమరచిన క్షణాల్లో
ఊహించని విపత్తు అనుభవాన్ని సగంలో రద్దు చేస్తుంది

చిత్రపటంలోని దృశ్యాన్ని చిత్రకారుడు చెరిపేసి
తెల్లటి నేపథ్యాన్ని చూపించినట్టు కొన్నిక్షణాలు తెల్లబోతాయి
అప్పుడు మనకి చూపు వుంటుంది, చూసేందుకు దృశ్యం వుండదు

. . .

పదునైన సందర్భమేదో హఠాత్తుగా గాయం చేసి వెళ్ళిపోయినపుడూ
పిడుగులాంటి భయంలోకి ఇంద్రియాలు మేలుకొంటూ, ముడుచుకొన్నపుడూ
మెరుపులాంటి ఆనందం కలలాగా ఎటునుండో పలకరించినపుడూ
కొన్ని శూన్యక్షణాలు తలలోపలి తలంలో మెరిసి మాయమౌతాయి

. . .

జీవనసంగీతం వినీవినీ విసుగు పుట్టినపుడూ
ఆలోచనల దారాలు ముళ్ళుపడి, విప్పలేని ఉక్రోషం కలిగినపుడూ
కలలో, జ్ఞాపకాలో నిద్రలోంచి ఉలికిపాటులోకి పంపినపుడూ
కవి అంటాడూ "నువ్వు జీవితమనుకొన్నదాని నుండి
జీవితం కాదనుకొంటున్న ఆ శూన్యక్షణాల వైపు చూడ"మని

"రెండు భావాల మధ్య, ఉద్వేగాల మధ్య
అందమైన యువతి అలవోకగా నవ్వు విసిరి, వెళిపోయినట్లుండే
ఆ ప్రశాంతమైన క్షణాలను తాకేందుకు ప్రయత్నించ"మని

"ప్రేమాస్పదులెవరినో ఉన్నంతసేపూ పట్టించుకోక, లేనపుడు బెంగపడినట్టు
ఆ దృశ్యాలు లేని శూన్యాన్నే, శబ్దాలు లేని మౌనాన్నే
దృశ్యాలలోనూ, శబ్దాలలోనూ వెదుకుతున్నా"వని చెప్పి కవి మౌనం వహిస్తాడు

*రచనాకాలం: 28.8.2012*
*ప్రచురణ: బ్లాగ్: 5.2.2013*

# పిలుపు

ఎప్పుడైనా, ఏ పనిలోనున్నా
అంతకన్నా అపురూపమైనదొకటి నీలోంచి నిన్ను పిలుస్తూవుంటుంది

పూలరేకులకన్నా సుతారమైన శూన్యమొకటి
సీతాకోకపై ఊగే రంగులకన్నా కోమలమైన ఖాళీ మెలకువ ఒకటి
తల్లికి పసిపాప నవ్వు స్మృతిలో నిలిచినట్టు నీలోపలి నేపథ్యమై చలిస్తూవుంటుంది

ఆకలితో కనలే కళ్ళలోని, స్పర్శలోని దైన్యంకన్నా మృదువుగా
నీలోపలి దయాగుణాన్ని తడుముతూ వుంటుంది

ఎప్పుడైనా, ఏ పనిలో వున్నా
లోలోపలి నిర్మలమైన లోకం ఒకటి
ఆట చాలించి రమ్మని గుమ్మంలోని తల్లిలా
దయగా, విసుగన్నది లేకుండా ప్రతిక్షణమూ నిన్ను తలుస్తూవుంటుంది

*2.3.2015 ఉదయం 11.43*

*బ్లాగ్: 5.6.2015*

# రాక

నువ్వు ఎందుకో ఇక్కడికి వస్తావు
వచ్చేసరికే ఇక్కడొక ఉత్సవం కొనసాగుతుంది

నువ్వు ఎవరో, చుట్టూ జరుగుతున్నది ఏమిటో
నీకు నువ్వుగా తేల్చుకోకముందే వాళ్ళంటారు
"నువ్వు ఫలానా, ఇది చెయ్యాలి, అది కూడ"దని

ఈ ఉత్సవానికి అర్థమేమిటని అడగబోతావు
"అదేమిటి కొత్తగా అడుగుతున్నా"వంటారు
జాలిదలచి "నిరాశ కూడ"దని ఓదార్చుతారు

వారికి నచ్చినట్టు ఉండబోతావు కాని
భయ, హింసాపూరితమైన ఉత్సవంలో
ఏదో వెలితి వుందని తెలుస్తూవుంటుంది

ఉత్సవాన్ని విడిచి ఏకాంతమైదానం చేరి
నీ జవాబు నీలోనే వుందని నమ్మి అడుగుతావు
"ఇదంతా ఏమి"టని

మరింత విశాలమౌతున్న ఆకాశం క్రింద
దృశ్యాలన్నీ అణగిపోయిన విశ్రాంతిలో ఉండిపోతావు
రాకపోకలు లేని నీలో కరిగిపోతావు

*12.12.2014 ఉదయం 11.35*
*బ్లాగ్: 31.5.2014*

# జీవితార్థం

అర్థం కావటం ఏమంత అవసరం
అర్థాలు తెలియని ఆకాశానికీ, నీకూ మధ్య
కురిసీ కురవని మేఘాల్లా ఎగురుతుంటాయి
పదాలూ, వాటి అర్థాలూ

'జీవితమంటే ఏమి'టని ప్రశ్నించుకొన్న ప్రతిసారీ
దిగులుమేఘాలపై ఓ కొత్త జవాబు
ఇంద్రధనస్సులా మెరుస్తూవుంటుంది

ఇదిగో దొరికిందని ఇంద్రధనస్సుని తాకబోయే ప్రతిసారీ
నిరాశ కలిగించే నీటితుంపరులు మినహా
ఏ రంగులూ చేతికి అంటుకోవు

జీవితమంటే ఏమిటైతే ఏమిటి, ఊరికే జీవించు
కళ్ళముందు ప్రవహిస్తున్న నదిలా, ఎదుగుతున్న చెట్టులా
ఎగురుతున్న ఉదయాల్లా, అస్తమయాల్లా, నక్షత్రాల్లా

ఊరికే జీవిస్తూ వుండు
నెమ్మదిగా, మరికాస్త నెమ్మదిగా
అర్థాల లోతుల్లోని నిశ్శబ్దమంత మృదువుగా..
ఊరికే..

*26.3.2014 మధ్యాహ్నం 1.18*
*వాకిలి.కాం జూన్ 2014*
*బ్లాగ్: 7.6.2014*

# ఒకే మెలకువ

“అవతలితీరానికి నాకొక నావ దొరికింది
ఎవరైనా వస్తారా నాతో” అని అడుగుతావు
నది ఒడ్డున ఖాళీ చేతుల్తో
ఊరికే తిరిగే బాలునివలే నిన్ను భావిస్తారు

“రండి, నాతో కాసేపు ఆడుకోండి
ఈ ఆటలలోంచే రెండోవైపుకి దారివుం”దంటావు
నది ఇసుకలా బిగుసుకొన్న వాళ్ళ క్షణాల్లోంచి
గుప్పెడైనా నీకోసం ఇవ్వలేరు

ఇంకా పసితనం పూర్తిగా ఆరిపోని
ఒకరిద్దరికి నీ మాటలు ఆశ్చర్యం కలిగించి
నీవైపు చూస్తారు కాని,
సాటివారి ఉత్సవాల హోరు వారిని తీసుకుపోతుంది

“తామేం చేస్తున్నారో తమకి తెలియదని”
చెప్పి వెళ్ళిన పూర్వయాత్రికులలానే
నువ్వు కూడా చిరునవ్వు నవ్వుకొని
నీ నావపై బయలుదేరి వెళ్ళిపోతావు

వాళ్ళ కోలాహలం దూరమయేకొద్దీ
వాళ్ళకీ, నీకూ భేదం లేదని
వేల స్వప్నాలను ఒకే మెలకువ
పహరా కాస్తుందని తెలుసుకొంటావు

*12.12.2013 ఉదయం 11.45 వాకిలి.కాం ఆగస్ట్ 2014 ఆటా సావనీరు 2014 బ్లాగ్: 6.8.2014*

# ఖాళీపాత్ర

ఈ ప్రపంచం నుండి పండుటాకులా రాలిపోయే రోజువస్తుంది
వైభవం మసకబారే ఇంద్రియాలూ, జారిపోయే స్మృతులూ మినహా ఏమీ మిగలవు
దేహాన్ని చివరి బంగారురంగూ, చల్లనితెరలూ తాకుతుంటాయి

అప్పుడేమనిపిస్తుంది
సముద్రంలో మునిగే నదిలా అనంతం వైపుగా నీ జీవితం స్పందిస్తుందా
తొలిసారి వీధిలోని ఉత్సవం చూస్తున్న బాలుని ముఖంలో వలే
జీవితంలోకీ, అనంతంలోకీ ఒక ఆశ్చర్యం మెరుపులా వ్యాపిస్తుందా
లేక, జీవితమంతా చేసినట్లు ఖాళీపాత్రలో గాలి నింపే ప్రయత్నం చేస్తుంటావా

నీ వెనుక అనంతం పచార్లు చేస్తోంది
ఈ క్షణమైనా వెనుదిరిగి చూడమని ఎవరో సందేశం పంపుతున్నారు

*12.12.2013 ఉదయం 10.50*
*ఈమాట.కాం జనవరి 2014*
*బ్లాగ్: 29.1.2014*

# అవతలితీరం గుసగుసలు

ఒక సాయంత్రానికి ముందు
ఇద్దరు వృద్ధులతో గడిపాను కాసిని నిముషాలు
మా చుట్టూ జీవనవైభవం ప్రదర్శిస్తున్న దృశ్యమాన ప్రపంచం
కరుగుతున్న క్షణాలతో పాటు
వారి వెనుక నేనూ వృద్ధుడినవుతున్న లీలామాత్రపు స్పృహ

వాళ్ళ మాటలు వింటున్నాను
“కనులకి సరిగా కనిపించటం లేదు, చెవులకి వినిపించటం లేదు
ఆకలి లేదు, నిద్ర రావటం లేదు
జీవితాన్ని అనుభవించటం తెలియకుండానే జీవితోత్సాహం అస్తమిస్తోంది
అవతలితీరం పిలుపు లీలగా వినవస్తోంది”

వారితో ఇన్నాళ్ళూ సన్నిహితంగా గడిపి
వారి జీవితం నుండి ఏం నేర్చుకొన్నానో తెలియదు కాని
వారి అస్తమయకిరణాలు ఇప్పుడేవో హెచ్చరికలు వినిపిస్తున్నాయి
ఏదో ఒకరోజు వృద్ధాప్యం నన్నూ ఆహ్వానిస్తుంది
నా అస్తమయకిరణాలూ చీకటిలో కరిగిపోతాయి

ఇంకా శక్తి ఉండగానే, ఉత్సవ సౌరభమేదో నాట్యం చేస్తుండగానే
విప్పవలసిన ముడులేవో త్వరగా విప్పుకోవాలి
“నీకు మరణం లే”దని జ్ఞానులు చెప్పిన రహస్యాన్ని
ఈ పడవ మునిగిపోయేలోగా కనుగొని తీరాలి

మా చుట్టూ కాంతిలో తేలుతున్న చెట్లూ
నిశ్శబ్దంలో తేలుతున్న పక్షుల పాటలూ
శూన్యంలో తేలుతున్న జీవితానుభవమూ
వాటిని విడిచి వెళ్ళే క్షణాల స్పృహలోంచి క్రొత్తగా కనిపిస్తున్నాయి

ఆ సాయంత్రం వృద్ధులతో గడిపిన నిముషాల్లో
వారెందుకు మాట్లాడుకొన్నారో తెలియదు కాని
వారిలోంచి, మునుపెన్నడూ వినని
అవతలితీరం గుసగుసలు వినిపించి నా యాత్రను వేగిరపరిచాయి

*14.3.2013 ఉదయం 11.44*
*మాగజైన్.సారంగబుక్స్.కాం 11.4.2013*
*బ్లాగ్: 20.4.2013*

# ఒక కలయిక

గది బయటి అలికిడి ఎవరినో నీలో ప్రవేశపెడుతుంది
తలుపులు తెరిచి ఒక జీవితాన్ని ఆహ్వానిస్తావు
ఒక మనిషి, ఆయనతో కొంత కాంతి, కొన్ని రంగులూ, నీడలూ
ఆయనలో కొన్ని శబ్దాలు, వాటిలోపల అగాధమైన నిశ్శబ్దం

ఒకరినొకరు చూస్తారు
రెండు మూలాల నుండి, అనంతయాత్రల నుండి,
రెండు దహనక్రియల నుండి,
పూవులా వికసించే, ముకుళించే చూపులతో ఒకరినొకరు తాకుతారు

మాటలేవో చెబుతాయి, మౌనమేదో వింటుంది, అలలు ఉపశమిస్తాయి
ముసురుకొనే నిశ్శబ్దంలో దేనికోసమో వెదుక్కొంటూ చూపులు విడివడతాయి

రెండు పాలపుంతలు కలిసినట్టు రెండు జీవితాలు కలుస్తాయి
మరొక కృష్ణబిలంలాంటి వియోగం ప్రాప్తిస్తుంది
ఇదంతా ఏమిటని మరొకసారి ఆశ్చర్యపోతారు ఎవరో..

*5.12.2014* మధ్యాహ్నం *12.36*
బ్లాగ్*: 1.6.2015*

# ఒక పలకరింపు తరువాత

ఎవరో నిన్ను పలకరిస్తే బదులిస్తావు
తరువాతేమన్నా చెబుతారని చూస్తావా, ఏ మాటా ఇటు రాదు
ఎదురుచూపు వంతెనపై ఎవరూ నడిచిరారు
నీకూ, తనకీ మధ్యనున్న ఖాళీ చూస్తావప్పుడు

మనుషులందుకే వస్తారు, సందర్భాలందుకే వస్తాయి
నీతో నువ్వుండిపోయినపుడు, నీలోనే ఇరుక్కున్నపుడు
నిన్ను బయటికి లాగేందుకూ, వారు బయటపడేందుకూ వస్తారు

ఒకరొక మాటని వెళ్ళిపోయాక, ఒక సందర్భం గడిచిపోయాక
నీ చుట్టూ వున్న ఖాళీ నిన్ను పలకరిస్తుంది, హత్తుకొంటుంది
ఖాళీ మైదానంలో పరిగెడుతూ రంగురంగుల గాలిపటాలు ఎగరేస్తావో
ఆకాశం ఇసుకతిన్నెలో ఓ ఇంద్రధనువు ఊహించీ, కూల్చివేసీ పకపకా నవ్వుతావో
నీకు నువ్వే సాంద్రమౌతూ, భారమౌతూ నీలోనే ఇరుక్కుంటావో నీ ఇష్టం

ఒక పలకరింపు చాలు, పిట్టకూత చాలు
ఒక వానచినుకో, పచ్చనాకో చాలు నీనుండి నువ్వు విముక్తి పొందటానికి

నీలోని పసివాడిని ఇప్పటికీ నమ్మగలిగితే
నీ చుట్టూ కన్ను తెరిచే కాస్త ఖాళీ చాలు
జీవితమొక పరిహాసంలా గడిపి వెళ్ళిపోవటానికి

*30.1.2015 ఉదయం 10.40*

*బ్లాగ్: 7.3.2015*

# స్వభావం

ఒకే స్వభావంతో జీవించటం కష్టంగా వుంటుంది

ఈ పూలు బావున్నాయన్నావు కదా, ఇవాళ చూడవేమిటంటారు
నిన్న అన్న మనిషి ఇప్పుడు లేడు
ఆ పూలని చూస్తే అదే విస్మయం ఎలా కలుగుతుందంటావు

ఎంత త్వరగా మారిపోతావని ఆశ్చర్యపోతారు
నిన్నటి స్థలంలో నిలిచి, నిన్నటి జీవితాన్నే మళ్ళీ జీవించటం
ఎలా సాధ్యమవుతుందని నీకూ ఆశ్చర్యం

జీవితం లోలోపలికి ప్రవేశిస్తున్నపుడు
మునుపటి నిర్వచనాలూ, కలలూ, సంతోషాలూ వెలిసిపోతాయి
బాల్యంలోని ఆటబొమ్మలై మిగులుతాయి

జీవితమంటే ఏమిటో తెలియటంలేదు కాని
ఆ ప్రశ్న తరువాత మేలుకొనే ఆశ్చర్యపు లోతుల్లో
జీవితం మరింత కొత్తగా మెరుస్తూనే వుంది

ఇక మునుపటి చూపు మిగలదు, స్పర్శ మిగలదు
మాటకందని అనంతమేదో
ఏ స్వభావంలోనూ నిలబడనీయక తనతో తీసుకుపోతుంది
బహుశా, జీవించటమొకటే నీ స్వభావంగా తీర్చిదిద్దుతుంది

*22.3.2014 మధ్యాహ్నం 12.40 బ్లాగ్: 28.9.2014*

# పేర్లు

అందమైన దృశ్యమొకటి మేకుకి తగిలించినట్టు
కవిత రాసాక ఒక పేరుకి తగిలించటం అలవాటు

పేర్లెపుడూ ఎందుకో ఆకర్షించవు
తరచూ చూసే మనిషైనా పేరు గుర్తురాక
లోపలి మైదానంలో తడుముకొంటూ తిరుగుతుంటావు

జీవించటంకన్నా, పేరు తెచ్చుకోవటం ముఖ్యం గనుక
పేర్లని గుర్తుంచుకొనే ప్రపంచంలో నువ్వొక వింతమనిషివి
ఒక మనిషి ఎలా నవ్వుతాడో, స్పందిస్తాడో గుర్తున్నట్టు అతని పేరు గుర్తుండదు

మనిషినొక పేరుగా, జాతిగా, జెండాగా గుర్తుంచుకొనే రోజుల్లో నిలబడి
ప్రతి మనిషీ తనదైన వెలుగునీడల చిత్రమనీ
భూమ్మీద అతనిలాంటి అద్భుతం అతనేననీ అనాలనిపిస్తుంది

ఫలమెంత రసవంతమని కాక, ఎలా కనిపిస్తుందో ముఖ్యమనే కాలంలో
పేర్లూ, శబ్దాలూ విడిచి జీవితం లోలోపలికి దూకి చూడమనీ,
సముద్రమంత ప్రేమ నీకోసం ఎదురుచూస్తుందనీ చెప్పాలనిపిస్తుంది

*27.5.2014 రాత్రి 12.20*
*బ్లాగ్: 2.6.2015*

# వెళ్ళనీ

'వెళ్ళనీ' అంటారు అమృతవిద్య తెలిసినవారు
పనితొందరలో వున్నట్టు పరుగులుపెట్టే గాలికీ, కిరణాలకీ
చేతులు విశాలంగా చాపి వీడ్కోలు పలికినట్టు
మనుషుల్నీ, ఊహల్నీ నిన్ను విడిచి వెళ్ళనిమ్మంటారు

'వెళ్ళిపోతే కొత్తవి వస్తాయా' అని అడుగుతామా
'కొత్తవి వచ్చే హామీ ఏమీ లేదు కాని,
వెళ్ళనివన్నీ ఉన్నచోటనే జీవం కోల్పోతా'యంటారు

వేటినీ వెళ్ళనివ్వం కనుకనే
మన చుట్టూ ఎడారుల్ని కావలికాస్తున్న దిగులు
మన ముఖాలపై చీకట్లను దాచే వెల్తురులాంటి నవ్వులు

హుందాగా వెళ్ళనివ్వటం మరిచినపుడల్లా
కిరణాల్లా బయలుదేరిన మనం నీడలుగా మారిపోతాం

ఈ బానిసత్వాన్ని ప్రేమగా భ్రమించి మురిసిపోతామా
స్వేచ్ఛ తెలిసినవాడు రహస్యంగా సమస్తాన్నీ ప్రేమిస్తాడనీ
బంధాలలో మునిగేవాడు రహస్యంగా తననీ ద్వేషిస్తాడనీ
మనం ద్వేషిస్తామని తెలిసికూడా ప్రేమకొద్దీ చెబుతూవుంటారు

*4.5.2014 మధ్యాహ్నం 1.42*
*బ్లాగ్: 17.8.2014*

# ఆనందంలోకి

ఎవరైనా ఆనందంగా కనిపిస్తే కారణమేమిటని అడగకు
కారణాలకేముంది, ఊహ లోపలి వైపు కావలసినన్ని వుంటాయి

ఒకటే ఆనందంలోకి తటాలున మేలుకొన్న,
కారణాల సంకెళ్ళను కాసేపైనా త్రెంచుకొన్న మనిషికి
విడిచి వచ్చిన దిగుళ్ళని గుర్తుచేయకు

. . .

కారణాతీత లోకమొకటి ఎవరినుండైనా అకస్మాత్తుగా పిలిచినపుడు
నేలమీది వ్యాకరణాలన్నీ ఒకేసారి విదిలించుకొని ఎగిరిపోక
భద్రగృహాల తలుపుల్ని పట్టుకొని ఆకాశంవైపు చూస్తే ఏం ప్రయోజనం

ఒక మనిషి సునాయాసంగా పువ్వైనపుడు, పక్షైనపుడు,
ఇంద్రధనువో, వానజల్లో, ఆకాశమో అయినపుడు
సూర్యుణ్ణొక ఆనందబిందువు చేసి కాంతి కురిపిస్తున్నపుడు

అసలేమీకాకుండా మిగిలినపుడు, మిగలనపుడు
కారణాల నీడలన్నీ విడిచి అతనిలోనికి పరుగుతీయాలి

కారణమేం కానీ, పసిబిడ్డలాంటి పరవశమేదో
సాటి మనిషినొక తెల్లని ఇంద్రధనువు చేసి
రా అనగానే వెళ్ళగలిగినవాడిదే కదా స్వర్గం!

*25.12.2013 ఉదయం 11.22*
*బ్లాగ్: 19.8.2014*

# మనుషుల్ని చూడగానే..

మనుషుల్ని చూడగానే వారి కళ్ళల్లో
కొలనులో చలించే ప్రతిబింబాల్లాంటి కలలు కనిపిస్తాయి
కలల వెనకాల ఉండీలేనట్లు మెరుస్తూ
జీవితం తనపట్ల తాను చూపే లాలస కనిపిస్తుంది

వారిని తాకబోయినపుడల్లా వ్యక్తిత్వాలని పట్టించుకోకుండా
వాటిలో వెలిగే జీవనసౌందర్యం చూస్తావు

"ఏమిటలా చూస్తున్నావు ఆశ్చర్యంగా" అన్నపుడల్లా
"మన జీవితాలన్నీ ఒకే జీవితమై కనిపిస్తోంది
మీరూ ఇలా చూడగలిగితే బావుండు"నని జవాబిస్తావు

విత్తనాన్ని అరచేతులలోకి తీసుకొన్నపుడే
చిటారుకొమ్మన వికసించే పూలపై తేలే పరిమళాలు
చిరుగాలితో చెప్పబోయే కబుర్లు నీకు వినిపిస్తాయి సరే కాని

కాస్త ఆగు, కాలాన్ని ప్రవహించనీ
ప్రతి అలనూ తానుగా సముద్రంలోకి మేలుకోనీ
ప్రతి జీవితాన్నీ ఏకైక మహాస్పందనలో కరగనీ అని
నీకు నువ్వు బోధించుకొంటూనే వుంటావు కదూ

*6.8.2014* మధ్యాహ్నం *2.10*
తెలుగు.వన్‌ఇండియా.ఇన్ *7.10.2014*
సాక్షి దినపత్రిక *11.10.2014*

# తోటివారిని

తోటివారిని గాజులానో, పూలలానో,
కదలని నీటిపై నిదురించే చంద్రునిబింబంలానో చూడలేమా
బహుశా, గ్రహాంతరాలలో ఏకాకులమై ఎదురైతే
అద్దంలో ప్రతిబింబంలా మృదువుగా చూసుకొంటాం ఒకరినొకరం

నిజంగా, తెలియనిచోట ఉన్నాం కదా
భూమి ఏమిటో, ఆకాశం ఏమిటో,
మెరిసే ఉదయాస్తమయాలూ, దిగులు కురిసే నల్లని రాత్రులూ
ఎందుకున్నాయో, ఏం చెబుతున్నాయో తెలియని
మంత్రమయస్థలంలో దారి తెలియక తిరుగుతున్నాం కదా

కనులంటే ఏమిటో, చూడటమేమిటో,
చూపు బయలుదేరే లోలోపలి శూన్యపు అగాధమేమిటో
ఎరుకలేకుండా ఋతువుల నీడల్లో తడుముకొంటున్నాం కదా

ఎవరి లోపల తడిమి చూసినా ఏముంటుంది
గుప్పెడు ప్రశ్నలూ, కాస్త కన్నీరూ, అర్థం సంతరించుకోని దిగులుపాట మినహా
ఎవరి కథ చూసినా ఏముంటుంది
అంచులు కనరాని కాలపు ఊయలలో ఏడ్చే, నిదురించే పసిబిడ్డ లోపలి నిశ్శబ్దం మినహా

తాకలేమా మరికాస్త కోమలంగా ఒకరినొకరం
చేరలేమా మరికాస్త సమీపంగా ఒకరికొకరం
చూడలేమా ఒకరిలోకొకరం మరికాస్త సూటిగా, లోతుగా, నమ్మకంగా..

*21.8.2014 మధ్యాహ్నం 12.50 మాగజైన్.సారంగబుక్స్.కాం 11.12.2014 బ్లాగ్: 18.12.2014*

# ప్రేమికునికి..

ప్రేమించానని పదేపదే చెప్పకు
మాటల్ని జీవించటం నుండి
వాటి మధ్యనున్న మౌనాన్ని జీవించటంలోకి వెళ్ళినపుడు
ప్రేమ ఒక పదం కాదని తెలుస్తుంది
రెండు జీవితాలు దేవాలయంలాంటి ఒకే మౌనంలో ప్రవేశించటం ప్రేమ

ప్రేమించమని పదేపదే అడగకు
తారకలు కాంతిని వెదజల్లినట్లు
ప్రేమించటమే ఉంటుంది, ప్రేమించబడటం ఉండదు

ప్రేమించటమంటే
నీలో వెలితి ఉందని భ్రమపడటం కాదు, వెలితి లేదని కనుగొనటం
ఖాళీగా కనిపించే ఆకాశం నీ హృదయంతో నిండిపోవటం ప్రేమ
ప్రేమ మేలుకొన్నపుడు
ఇవ్వవలసింది ఎంతకీ తరగదు, తీసుకోవలసిందేమీ కనిపించదు

ఈ కవిత చూడు:
పూవుని కోసేవాడికి సౌందర్యాన్ని తాకటం తెలియదు
సౌందర్యరహస్యం తెలిసినవాడు తానే పూవు అవుతాడు
జీవితాంతం సాధన చేసైనా పూవుని చూడటం నేర్చుకోవాలి
కడపటి క్షణంలో పూవులా రాలాలి

అవును, ప్రేమ ఒక పుష్పం

*3.9.2012 నవ్య వారపత్రిక 13.3.2013 బ్లాగ్: 7.3.2013*

# నేనూ - స్త్రీలూ

వాళ్ళని చూస్తూనే ఉన్నాను నా బాల్యంనుండీ
వాళ్ళ సమీపంలో పసివాడినవుతాను
కలలు మేల్కొన్న యువకుడినవుతాను
నిండైన నదిలాంటి పూర్ణమానవుడినవుతాను

నా అంతట నేనే అవుతున్నానా
వాళ్ళేమైనా చేస్తున్నారా అని ఆశ్చర్యం కలుగుతుంది

వాళ్ళని చూడటమెపుడూ ఆశ్చర్యంగానే వుంటుంది
నేనీ మట్టి మనిషినైనట్టూ, వాళ్ళు ఏ కాంతినుండో వచ్చినట్టూ
లేదూ, ఇది వాళ్ళ కాంతి లోకమైనట్టూ
నేను ఏ చీకటినుండో వాళ్ళకోసం వచ్చినట్టూ ఉంటుంది

. . .

వాళ్ళు నన్ను చూస్తూనే ఉన్నారు నా బాల్యంనుండీ
నా సమీపంలో తెల్లనికాంతి అవుతారు
కలలరంగుల్తో రెపరెపలాడే కిరణాలవుతారు
నిండైన నదిలాంటి పూర్ణ జీవితమవుతారు

నా సామీప్యం వాళ్ళనలా చేస్తుందా
నేనేం కావాలో బోధిస్తున్నారా అని ఆశ్చర్యం కలుగుతుంది

వాళ్ళు నన్ను చూడటమెపుడూ ఆశ్చర్యంగానే వుంటుంది
అందమైన కల ఏదో అకస్మాత్తుగా జీవితంలో వాలినట్టూ
బరువైన జీవితమేదో కలలాగా తేలిపోయినట్టూ వుంటుంది

*16.4.13 రాత్రి 10.25 తెలుగు.వన్ఇండియా.ఇన్ 6.5.13 బ్లాగ్: 7.5.13*

# అసమాన్వి

ఆమె నాకు కవిత్వం
రాయిలాంటి జీవితంలో కోమలత్వం చూపుతోన్న శిల్పం

దయనీ, సౌకుమార్యాన్నీ, పసిదనపు ఆశ్చర్యాలనీ వెదజల్లే రసమయలోకం
ఉదయాస్తమయాకాశాల్లో సూర్యుడు వెదజల్లే ఊహల్లోపలి ప్రపంచం
వెన్నెల కాయటం, రుతువులు మారటం, కాలం మృదువుగా కరిగిపోవటం

ఆమెని దర్శించాను పలుమార్లు
పూలు దయగా పూయటంలో, వికసించటంలో,
రేపటి పూలకి దయగా చోటువిడవటంలో

ఆమె ఆకాశమనీ, నేను దానిలో రాత్రిభాగాన్ననీ
ఎప్పటికైనా నేనూ ఆమెవలే పూర్ణవలయం కావాలనీ
సంతృప్తిలోకీ, క్షమలోకీ, సంతోషంలోకీ మేలుకోవాలనీ

ఎప్పటికైనా ఆమె మాత్రమే
ఆమెతో నిండిన మానవులు మాత్రమే లోకాన్ని నడిపించాలనీ
బలప్రదర్శనలతో విసిగివున్న ప్రపంచాన్ని
ఆమెలాంటి ప్రేమతో నింపాలనీ కలగంటాను

. . .

ఈ కవిత్వం రాస్తున్నది ఎవరు
నా లోపలి ఆమె మాత్రమే కదా..

*3.3.2013 మధ్యాహ్నం 12.23*

# తాకినపుడు

మాటలసందడిలో తటాలున ఆమెతో అంటావు
నీ నవ్వు కొండల్లో పరుగులుతీసే పలుచనిగాలిలా వుంటుందని
పలుచనిగాలీ, మాటల సెలయేరూ ఉన్నట్లుండి
చిత్రపటంలోని దృశ్యంలా ఆగిపోతాయి

కవీ, ఏం మనిషివి నువ్వు
ప్రపంచాన్ని మొరటుగా వర్ణించడం మాని
రహస్యంగా, రహస్యమంత సున్నితంగా ప్రేమించటం
ఎప్పటికి నేర్చుకొంటావని నిన్ను నువ్వు నిందించుకొంటావు

తాకితే కాని, పదాల్లోకి ఒంపితే కాని
నీ చుట్టూ వున్న అందాన్నీ, ఆనందాన్నీ అనుభవించాననిపించదు
వాటిని తాకకముందున్న వివశత్వ క్షణాల్లో నువ్వు నిజంగా జీవిస్తావు
తాకుతున్నపుడల్లా నిన్ను మరికాస్త కోల్పోతావు

పసిబిడ్డల పాలనవ్వులకన్నా సరళంగా
జీవితం తననితాను ప్రకటించుకొంటోంది ప్రతిక్షణం
నీకో ముఖం వుందని అద్దంచెబితే తప్ప తెలుసుకోలేని నువ్వు
ప్రతిబింబాల వెంట పరుగుపెడుతూ జీవితాన్ని తెలుసుకోవాలని చూస్తావు

ఆమె నవ్వులో మాయమైన అమాయకత్వాన్ని మళ్ళీ ఆమెకి ఇవ్వగలవా

*9.5.2014 ఉదయం 11.21*
*మాగజైన్.సారంగబుక్స్.కాం 12.6.2014*
*బ్లాగ్: 21.6.2014*

# ఒకే సంతోషానికి..

ఆకాశాన్ని నీలివస్త్రం చేసి విసిరేసినట్టు ఆమె నవ్వుతుంది
విషాదస్మృతుల గుహల్లో దాగిన అతను
బంగారుటెండలాంటి నవ్వుల్లోకి పరుగుతీస్తాడు
అప్పటివరకూ తలపైన శిలలాగా మోస్తున్న బాధ ఏదో
నల్లనిముసుగు తీసి ఉత్త ఊహలా కనిపించి మాయమౌతుంది

ఆమె చిత్రమైన మనిషి,
భూమ్మీదికి పసితనాన్ని తప్ప, యవ్వనాన్నీ, ప్రౌఢమినీ
వెంట తెచ్చుకోవటం మరిచిపోయినట్లుంటుంది
ఆమె నిష్కపటంగా పంచే సంతోషాన్ని నిష్కపటంగా స్వీకరిస్తూనే
రహస్యదుఃఖాల్ని రహస్యంగా జారవిడుస్తుంటాడు

ఇంత సంతోషంగా ఎలా ఉంటావని ఉండలేక అడిగాడొకసారి
ఆమె అందీ "ఎవరన్నారు, ఎప్పుడూ సంతోషంగా ఉంటానని,
నిన్ను చూసి కదా సంతోషం కలిగేది, అదే ప్రశ్న అడగాలని నేనూ అనుకొన్నాను"

వాళ్ళ నవ్వులకెరటాలు మౌనంలో ఇంకిపోతున్నపుడు
తడితో మెరిసే శబ్దాలు వాళ్ళనిలా తాకి వెళ్ళాయి

"మీరిద్దరూ ఒకే సంతోషానికి రెండు కొసలు
ఒకరి నుండొకరు వెనుదిరిగినపుడు సంతోషానికి దూరమౌతారు
ఒకరికొకరు ఎదురైనపుడు ఒకే సంతోషపు పూర్ణవలయ మౌతారు"
చేతిలో చేయి గట్టిగా పట్టుకొన్న వారి కన్నీటిపొరల్లో
సమస్తసృష్టి తన నొకసారి చూసుకొని నిట్టూర్చింది

*10.12.2013 రాత్రి 1.21 'ఆదివారం' ఆంధ్రభూమి దినపత్రిక 26.1.2014 బ్లాగ్: 26.1.2014*

# ఆమె

ప్రేమకాంతి నా రోజుల్ని వెలిగించే ఒక సాయంత్రం ఆమె అడిగింది
"మీతో అబద్ధాలు చెప్పాననీ, మోసపోయారనీ అనిపిస్తే ఏం చేస్తారు
నాపై కోపం వస్తుందా"

నా చివరి బంగారుకిరణాలు చీకటికి అప్పగించి సెలవుతీసుకొంటున్నాయి
పరుచుకొంటున్న ప్రశాంత నిశ్శబ్దంలో పిట్ట కూసినట్టు
ఊహించనివైపు నుండి వాలే మౌనంలోంచి ఒక్కొక్కమాట ఆమెతో అన్నాను

"లేదు, నీపై కోపం రాదు ఎప్పటికీ
కొన్ని తప్త క్షణాల్లో సహచరిగా భావించినా, నువ్వు ఒక పసిపిల్లలా కనిపిస్తావు
నీ నిర్మలమైన చిరునవ్వు ప్రాభాతకాంతిలా ఎన్నోసార్లు దు:ఖవిముక్తుడిని చేసింది
నీ చుట్టూ సంచరించే చిరుగాలులు చల్లటి నదీజలాల్లా తేలికపరిచాయి
నీ మాటలూ, మౌనమూ రోదసిలో విహరించే అన్వేషిని చేసాయి
నా పేలవమైన సమయాలని నీ రూపం కోమలమైన దిగుల్లోకి పుష్పింపచేసింది

నీ పట్ల కృతజ్ఞత ఉంది
జీవితం ప్రసాదించిన కానుకలలో అపురూపమైన కానుక నువ్వు
విడిపోయేరోజు సమీపించేసరికి నేనుకూడా నువ్వు వదులుకోలేని కానుకలా మారతాను
నన్ను పోగొట్టుకొన్న దు:ఖం నీకూ జీవితమంతా పరుచుకొంటుంది"

ఆమె అంది, "ఇది తీయని ప్రతీకారం"
ఆమె చల్లని నవ్వుపై చీకట్లు వాలుతున్నాయి

. . .

నాలో తీయగానైనా ప్రతీకారకాంక్ష ఉందో, లేదో హృదయానికి తెలుసు
నాకు తెలుసు, తానెక్కడ వున్నా మేం ఒకటేనని, వేరుకావటం ఆమె ఊహ మాత్రమేనని

ఆమెవల్ల ఏయే విశాలవిశ్వాలకి మేలుకొన్నానో, విస్తరించానో ఆమెకి తెలియదు
ఇంకా, తానొక పసిపిల్ల కదా

జీవితమొక మొరటుస్పర్శ చాలాసార్లు
నానుండి వెళ్ళిపోయాక ఆమెని జీవితమెలా లోబరుచుకొంటుందో తెలుసు
ఎందరిని చూడలేదు, ధూళిలా, రాలిపడిన పూలలా బ్రతికేవాళ్ళని
ఒక మరపురాని సంతోషం మిగిల్చే మరువలేని దు:ఖం ఆమెలో ప్రవేశపెట్టకపోతే
మాయలో ఎలా దారి తప్పుతుందో, వెలిసిపోయిన చిత్రపటంలా మిగులుతుందో తెలుసు
తానింకా ఒక పసిపిల్ల కదా

చీకటి ముసురుకొంది, చీకటి కన్నులు చెమరించినట్లు నక్షత్రాలు మెరుస్తున్నాయి
"అవి వెల్తురుచినుకులు కావనీ, ఒక్కొక్కటీ నా జీవితం పట్టనంత కాంతిలోకా"లనీ
కన్నులనుండి జారేందుకు వెనుకాడుతున్న కన్నీటిబిందువు చెప్పింది
"ఆమె వెళ్ళిపోయింది, నువ్వైనా వుండవా" అనబోతున్నానని బిందువుకి తెలిసినట్లుంది

. . .

ఆమె ఉంటే జీవితమెలా వుండేదో తెలియదు కాని
ఆమెలేని దిగులు మరింత దయలోకీ, కాంతిలోకీ నడిపించింది
తన వెలితిని నింపుకొనేందుకు అప్పటినుండీ విరామమెరుగక వికసిస్తూవున్నాను

ఆమె ఎక్కడుందో, ఎలావుందో చూడాలని చాలాసార్లు అనిపిస్తుంది
అప్పుడు, పూలపై వాలిన మంచుబిందువులూ, పక్షుల రవాలూ, సెలయేటిపరుగూ,
మనుషుల చిరునవ్వులూ, దు:ఖితులపై ఎవరోఒకరు కురిపించే దయా
లోకం నన్ను తాకే మృదువైన సమయాలన్నీ ఆమె మాలో లేదా అని నవ్వుతాయి

*23.8.2012*

బ్లాగ్: *24.8.2012*

# ఒక విడిపోని స్మృతిలోకి

సరే, మన హృదయాలు ఒకరిలో కొకరివి వెళ్ళిపోయాయా, లేదా
నీలోకి చూసుకో ఓసారి, తడికన్నులతో కనిపిస్తున్నానో, లేదో
నా స్మృతి గులాబీలా వికసిస్తూ వుందో, వాడిపోయిందో

ఇక చెప్పేదేమీ లేదు, మన స్పర్శలలో అదనంగా మేలుకొనే కొత్తలోకాలూ లేవు
మనకి ప్రేమంటే ఒక స్వచ్ఛమైన మెలకువ
మళ్ళీ ఎదురైనపుడు మనలో ఇంద్రధనువుని తెరిచే చిరునవ్వే మన ఏకైక సంభాషణ
ఒకరికొకరం గుర్తొచ్చినపుడు పాపాయిలా కళ్ళు తెరిచే దిగులే సాంత్వన

మృదువుగా విను నా చివరి మాటలు
వివరణలేవైనా ప్రేమపై వాలే నీడలని తెలిసినా
జాగ్రత్త నా బలహీనత గనుక, మనకీ జీవించటం నేర్పిన మౌనాన్నుండి
నీ దగ్గర బహిరంగపరచే పసిదనం నుండి, బేలతనపు ఉత్సాహం నుండి వస్తున్న మాటలు

నువ్వు వినవని తెలుసు
నా అర్థాలకన్నా, పదాల చప్పుడే నీకు ఇష్టమని తెలుసు
వాటిని పరుగుపెట్టించే ఉత్సాహం ఇష్టమని తెలుసు
ఉత్సాహం కన్నా, నేనుంటే చాలు ఊరికే నీతో నువ్వు నిండిపోవటం ఇష్టమని తెలుసు
అయినా నాతో నడువు, ఈ చివరిమాటల చివరి అర్థాలలోకి

మన తొలి ఆశ్చర్యాలకు ముందే మనం తెలుసు
జీవనమూలాల్లో మనం యుగాలపర్యంతం కలిసే జీవిస్తున్నాము
పైపై బెంగల అలల లోతుల్లో ఎపుడో ఒకరితో ఒకరం నిండిపోయాము

మనం తొలిసారి ఎదురైనపుడు మనలోపలి వెలితి ఒకటి తెరలా తొలగింది
ఒకరి అద్దంలో మరొకరిని చూసుకొన్నపుడు మనమెపుడూ నిండుగా ఉన్నామని కనుగొన్నాము
ఇక చాలు, ఎవరిదారిన వాళ్ళం ఎప్పుడూ కొత్తగా జన్మించటంలోకి వెళ్ళిపోదాము

ఒకరినొకరం చూసుకొన్న క్షణాలు చాలవా జీవితమంతా విసుగులేకుండా బ్రతికేందుకు
దారిలో ఎదురైన పిట్టలకి కొత్త సంగీతపు పాఠాలు బోధిస్తూ తిరిగేందుకు
పగళ్ళని పూవులుగా, రాత్రుళ్ళని నక్షత్రాలుగా జీవితమంతా వెదజల్లుకొనేందుకు
విడిపోయేవేళ మేఘావృతమైన ముఖాలూ, వర్షనేత్రాలూ చాలవా
భూమిపై జీవించి వెళ్ళిన గుర్తులేవో మిగిలేందుకు

. . .

ఇక మాటలు లేవు ఎక్కడా
ఒక నక్షత్రమేదో సమీపంలో మెరిసి మాయమయింది
ఇప్పుడిక దేనినీ గుర్తుపట్టాలని లేదు

*30.8.2012*
*తెలుగు వెలుగు అక్టోబరు 2012*
*బ్లాగ్: 1.10.2012*

# నువ్వు లేని వెలితిలోంచి..

"నక్షత్రాలన్నింటితో ఆకాశమూ, అంతులేని ఐశ్వర్యాలతో ప్రపంచమూ అన్నీ నాకు ఉన్నా ఇంకా కావాలని అడుగుతాను. కానీ ఈ ప్రపంచంలో మరీ చిన్న మూల కాస్త చోటుంటే చాలు, ఆమె నాదైతే.." నీకోసం వెదుకుతున్నపుడల్లా టాగోర్ మాటలు నా నేపథ్యంలో మృదువిషాదంతో చలిస్తూనే వుంటాయి. ఇంతకూ ఎవరు నువ్వు. ఎక్కడ ఉన్నావు. ఎంతకాలం నీకోసం దు:ఖిత హృదయంతో వెదకాలి.

వసంతకాలపు గాలుల్లాంటి చల్లని తాజా ఊహలు సంచరించటం మొదలైన తొలి యవ్వనదినాలనుండీ నీకోసం వెదుకుతూనే వున్నాను. నా ఊహలవెంట నన్ను నేను ప్రోవుచేసుకోవటంలోకీ, పోగొట్టుకోవటంలోకీ ప్రవహిస్తున్న కాలాలనుండీ; కలలూ, అమాయకత్వమూ, కాస్తంత దయా కదలాడే ప్రతి స్త్రీమూర్తి కళ్ళలోనూ, చిరునవ్వులోనూ నీ ఉనికికోసం తడుముకొంటూనే ఉన్నాను. బంగారువన్నెలో మెరిసే ఆఖరు సూర్యకిరణంలాంటి చిరునవ్వు వెనుక నన్ను దాచుకొని వాళ్ళని "ఆమె నువ్వేనా" అని అడుగుతాను.

వేణుగానంలో మేలుకొనే రాగాలలోకీ, గాలివాలులో పూలు సుతారంగా పరిచే పరిమళాల లోకాలలోకీ నా చేయి పట్టుకొని పసిపిల్లలా సునాయాసంగా మాయంకాగలిగే నీకోసం, ఆకాశమో, సముద్రమో హత్తుకొన్నట్టు నన్ను దగ్గరకు తీసుకొనే నీవంటి స్త్రీకోసం వెదుకుతూ, వాళ్ళని "నువ్వేనా" అని అడుగుతాను. కానీ, వాళ్ళింకా జీవించటం మొదలుపెట్టని మామూలు యువతులు. ప్రపంచం రాసులుగా పోసి చూపించే అనుభవాల ఎండమావుల వెనుక పరుగులుతీసే సాధారణస్త్రీలు. ఉత్త దేహధారులు. నా ప్రశ్న వినగానే, ఉదయకాంతిలో వెలవెలబోతున్న వెన్నెలలాంటి చిరునవ్వులతో వాళ్ళు దూరతీరాలకు తరలిపోతారు. పక్షిలా వాళ్ళ వెలుతురు

ఎగిరిపోయాక, వాలుతున్న రాత్రి లోలోపలికి ఒదిగిపోయి, ముసురుకొంటున్న చీకటిని నీ ఒడిగా ఊహించుకొని మొహం దాచుకొని కన్నీటికెరటాల్లో ఊగిసలాడుతాను.

స్వేచ్ఛలోకి పక్షులు పాడే పాటలూ, ఈ లోకాన్ని మరచి రమ్మని పూలు పంపే రంగురంగుల ఆహ్వానాలూ, నల్లమబ్బుల అంచున దిగులు చివరి చిరునవ్వుల్లా మెరిసే వెండితీగల సంగీతమూ, ఏకాంతరాత్రుల్లో అలలుగా ప్రవేశించే సముద్రమంత లోతైన నిశ్శబ్దమూ నా ఉనికిని తాకుతున్న ప్రతిసారీ, నువ్వు నా ప్రక్కన ఉంటే బావుండునని కలగంటాను. నువ్వు లేని వెలితిలోకి నన్ను విసిరేసుకొని గమ్యంలేకుండా తిరుగుతూ, సమస్తసృష్టినీ ఆమె ఎక్కడ ఉందో చెప్పమంటూ బ్రతిమాలుతాను. నన్ను నాకు మిగలకుండా చేసే మంత్రనగరంలాంటి నీ సాన్నిహిత్యంకోసం అలసినవేళల తపిస్తాను. చల్లటినదిలాంటి వెన్నెల తనలోకి మృదువుగా హత్తుకొంటున్నపుడు, ఆ మెత్తనికాంతి నువ్వు రహస్యలోకాలనుండి వినమని పంపిన ప్రేమగీతంలా తలచుకొంటాను.

నువ్వు ఎవరో ఇప్పటికీ తెలియదు. ఏ యుగాల వెనుకనో, నువు చూపిన గొప్ప ప్రేమా, నీ కళ్ళలో వెలిగిన దయా, నా పసిదనపు ఉద్వేగాలపై చల్లిన చల్లటి క్షమా లీలగా, దూరాల నుండి వినవచ్చే సంగీతంలా నన్ను తాకుతూనే ఉంటాయి. ఇప్పుడిక, జీవితం మలిసంధ్య వైపు వాలుతోంది. తెగినదండ నుండి ముత్యాలు రాలినట్టు నా రోజులు జారిపోతున్నాయి. నిన్ను కనుగొనగలనన్న ఆశ దూరమౌతున్న ఓడతెరచాపలా కనుమరుగౌతోంది. ఉత్త గాలిపాటల్లాంటి వినోదాలతో సరిపెట్టుకొనే జ్వరపీడిత ప్రపంచం నన్ను రేవు విడిచిపొమ్మని తొందరపెడుతోంది.

ఇక నువ్వు కనిపించవు. ఏ ప్రయాణపు మలుపులోనో తటాలున ఎదురై "నేనే"అని చిరునవ్వు నవ్వినా, పరాకున నిన్ను గుర్తుపట్టగలనో, లేనో తెలియదు. కానీ, నువ్వున్నావు గనుక, నా ఉనికి లోలోపల నీ కోమలస్పర్శ తెలుస్తోంది గనుక, కన్నీటితోనైనా జీవితాన్ని శుభ్రం చేసుకొంటున్నాను. నిన్ను వెదికే చూపుల్ని నీరెండలా

పరిచి పరిసరాలని ప్రేమమయం చేసుకొంటున్నాను. ఏ రహస్యరూపంలో సమీపిస్తావోనని ప్రతిమనిషిలో నిన్ను చూస్తూ ప్రేమగా తాకటం నేర్చుకొంటున్నాను.

ఏ స్థలకాలాల సరిహద్దుల ఆవలనో మనం ఒకటిగా ఉన్న స్థితిలోంచి, కేవలం ఒక బాల్యచేష్టగా నిన్ను విడిచి, ఈ లోకంలోకి చపలచిత్తుడినై పరుగుపెట్టానేమోనని తరచూ నన్ను నిందించుకొంటున్నాను. తెలివితక్కువగా నేను రావాలనుకొన్నాను సరే, నువ్వైనా చేయిపట్టుకొని ఆపలేదెందుకని బేలగా అడుగుతున్నాను. బహుశా, నువ్వు నన్ను చూస్తున్నావేమో, దయగా నవ్వుతున్నావేమో. మనం ఒకటే కదా అని నేను వినలేని రహస్యభాషణలో ధైర్యం చెబుతున్నావేమో. కానీ, తెలియని భారాన్ని మోస్తున్న విసుగేదో లోలోపలినుండి నన్ను త్వరగా నడవమని చెబుతోంది. ఈ క్రీడ చాలు, ఈ నటన చాలు, ఎండమావుల వెంట ఈ పరుగు చాలు, ఎండలో నిలబడి నీడని చెరపాలని చూసే తెలివితక్కువ పనులు చాలు. ఇక చాలు.

బలమైనకెరటంలాంటి దు:ఖం త్వరగా నిన్ను చేర్చేందుకు కమ్ముకొంటోంది. మహాగ్నిగర్భంలో వెలిగే కాంతిలోకాలు నీ పిలుపుని తెలియచేస్తున్నాయి. వాటి కాంతి ముఖంపై పారాడినప్పుడు, చిరకాలపు వియోగం తరువాత నువ్వు నా నుదుటిని ముద్దు పెట్టుకొంటున్న ఉద్వేగం నాలోంచి తోసుకువస్తోంది. ఇక చాలు. ఈ ప్రయాణం త్వరగా ముగించాలి. చేయవలసిన పనులు వేగంగా పూర్తి చేయాలి. బింబాన్ని ఎక్కడో పోగొట్టుకొని, వెదుక్కొంటున్న అద్దంలోని ప్రతిబింబంలా, నిన్ను పోగొట్టుకొని ఈ లోకంలో సంచరించింది చాలు. త్వరగా నిన్ను చేరాలి.

కన్నీటిబిందువుల్లాంటి అక్షరాలని ముగించి, ఏకాంతరాత్రి విసిరే చీకటి మైదానాల వెంట, నిశ్శబ్దాల వెంట, తప్తదేహాన్ని విడిచి నన్ను నీలోకి విసిరేసుకోవాలనే గాఢనిద్రల వెంట.. ప్రపంచంలో అడుగైనా ముందుకు పడని స్వప్నంలోని పరుగుతో..

చిన్నసవ్వడైనా ఎవరికీ వినపడనివ్వని తీవ్రమైన దు:ఖంతో.. నీ కోసం నిలబెట్టుకొంటున్న ఈ ఉనికిని ఏ అర్థమూ లేని ఈలపాటలా రద్దుచేసుకోవాలన్న ఉద్విగ్నతతో..

ఎవరు నువ్వు నుండి ఎవరు నేను లోకి.. సృష్టి అంతా పొగమంచులో మాయమయ్యాక, పొగమంచు కూడా మాయంకావటంలోకి.. ఎవరూ, ఏదీ లేకపోవటంలోకి.. దేహాల, దేశాల, కాలాల అవతలికి ఇదిగో, ఇక్కడే ఇప్పుడే నిన్ను చేరుకోవటంలోకి..

*14.1.2013*
*తెలుగు వెలుగు నవంబరు 2013*
*బ్లాగ్: 1.11.2013*

# కలయికలూ – ఎడబాట్లూ

మా యవ్వనరుతువులో ఆమెని చూసాను, ఆమె నన్ను చూడటం చూసాను
దేహం నిండా, కదలికల నిండా మోహపరిమళాలు వ్యాపించే రోజుల్లో
ఒకరికొకరం దేవతల్లా ఎదురయ్యాము
కలల్ని అదిమిపెట్టి, అర్థంలేని నవ్వుల్లోకి విడిచిపెట్టి
దేహాల్ని దూరంగా ఉంచి మా నవ్వుల్ని కౌగలించుకోనిచ్చాము

విశాలమైన ప్రపంచం, అనంతమైన కాలం, పలు సాలెగూళ్ళ జీవితం
మమ్మల్ని చెరొకచోటికీ, పరస్పర స్మృతుల్లోకీ విసిరేసే చివరినిముషాల్లో
మా చూపుల్లో, నవ్వుల్లో శిశిరరుతువులు దోబూచులాడాయి

. . .

చాలాకాలం కాలం పేజీలు త్రిప్పుతూ మా కథలు విడిగా రాసుకుపోయింది
ఒకరి కథలో మరొకరు లేము, ఒకరి చిరునవ్వుకీ, కన్నీటికీ మరొకరు కారణం కాము

ఓ కొత్త పేజీలో రెండుకథలూ అకస్మాత్తుగా దారిలో ఎదురయ్యాయి
ఇప్పుడు మేం దేవతలంకాము, మాలో తప్తజ్వాలల కాంతులు లేవు
మా మేఘచ్ఛాయల నవ్వుల చివర స్మృతులేవో తటిల్లతలా మెరిసాయి

ఘనీభవించిన దశాబ్దాల మౌనాన్ని ఒక్కొక్క మాటతో కరిగించుకొన్నాము
అర్థంకాని అర్థాలేవో నిండిన మబ్బుతునకల్లాంటి పదాలతో
ఒకరినొకరం స్త్రీ, పురుషుల్లా కాక, మనుషుల్లా స్పృశించుకొన్నాము
మళ్ళీ దూరమౌతున్నపుడు పలుచని ఆర్ద్రత మా మధ్య వ్యాపించి
మేమెప్పుడూ దగ్గరగా ఉన్నామని గుసగుసలాడింది

. . .

బహుశా, మళ్ళీ కలుస్తాం, నక్షత్రాలు రమ్మని పిలిచే చివరిరోజుల్లో
అప్పుడు చిరునవ్వులుండవు, మాటలుండవు
ఒకరిచేయి మరొకరు మృదువుగా పట్టుకొంటాము
మా స్పర్శ వెంట మనమొకే జీవితమనే భావమేదో ప్రవహిస్తుంది

అప్పుడు, మా దేహాలు మాయమై, భావాలు మాయమై
నక్షత్రాలని కౌగలించుకొన్న నిశ్శబ్దమేదో తనలో మమ్మల్ని కరిగించుకొంటుంది

*29.1.2013*
*వాకిలి.కాం 8.2.2013*
*బ్లాగ్: 8.2.2013*

# ఆమె స్పర్శ

ఆమె చేతిని చేతిలోకి తీసుకొన్నపుడు
సగంప్రాణంగా సంచరిస్తున్న దు:ఖమేదో
కట్టతెగిన నదిలా కాసేపు క్రమ్ముకొంటుంది

ఆమె నీకు ఒక స్త్రీ మినహా ఏమీ కాకపోవచ్చును
రవంత కాంక్షాపరిమళంతో వెచ్చనైన స్పర్శ
ఆమె నుండి దయగా నీలోకి ప్రవహిస్తున్నపుడు

ఎండినలోయలు నదులతో నిండుతున్నట్లూ
పచ్చని జీవితం మేలుకొనే సందడి
మైదానాల నిండా వ్యాపిస్తున్నట్లూ వుంటుంది

నిజంగా, ఒక స్త్రీని, దేహం మాత్రమే కోరుతుందా
దేహం మాత్రమే ఈ లోకంలో సగంగా తిరుగుతోందా

అద్దంలో ప్రతిబింబంలా నువ్వు నవ్వేవాటికి నవ్వే, ఏడ్చేవాటికి ఏడ్చే
తెలియరాని లోకాలకి, నీలానే, ఏకాంతపథికురాలయే
మరొక హృదయం కోసం నీ హృదయం కూడా వెదుకుతోందా

ఆమె తాజాస్పర్శ నీలోకి ప్రవహిస్తున్నపుడు
మీరు కలుస్తూ ఉండగానే వేరుపడుతూ వుండటం గమనిస్తావు
ఆమె నీ స్త్రీ కాదనీ, తనకంటూ ఉనికిలేని నీ మనిషిలా
ఎవరూ ఉండరనీ, కూడదనీ తెలుసుకొంటావు

వేగంగా ఎదురైన నక్షత్రాలు వేగంగా వెనుకకు వెళ్ళిపోయినట్లు
ఆమె చేయి విడిచేలోగానే ఆమె నుండి విడిపోతావు

ఒక అమూర్త సమయంలో
సగాలన్నీ ఉత్త ఇంద్రధనువులని తెలుసుకొంటావు
సూర్యకాంతినీ, వాననీ విడిగా గుర్తుపడతావు
చల్లని గాలితెరలాంటి చిరునవ్వులోకి మేలుకొంటావు

*29.12.2013 ఉదయం 12.08*
*బ్లాగ్: 8.8.2014*

# నువ్వే ఇన్ని అయ్యావని..

నీ ప్రాణం కన్నా ఎక్కువని దు:ఖపడే స్త్రీ కూడా
నీ బలమైన ఊహ తప్ప నువ్వు కాలేవు

సాలెపురుగు తనలోంచి సృజించిన గూడులా
ఆమె చుట్టూ నీలోంచి ఒక ఊహ అల్లుతావు
నీ ఊహలా ఉండాలని ఆమెని నిర్బంధించటం మినహా
నీ ఊహపై మేనువాల్చి విశ్రాంతి కోరుకోవటం మినహా
నీకు నిజంగా ప్రేమంటే తెలియదు

శ్వాసల కెరటాల్లో పడిలేస్తూ జీవించే నువ్వు
కాస్త విశ్రాంతి కోరుకోవటం సహజమే కానీ
దానికోసం అలలనుండి ఉప్పెనల్లోకి దూకటమే ఆలోచించాలి

ఒకనాడు ప్రాణం కన్నా ఎక్కువైన ఊహలన్నీ
కొన్ని సూర్యాస్తమయాల తరువాత నీ ప్రాణానికి దూరంగా చరిస్తాయి
ఒక కొత్త సూర్యోదయంలో మరలా నీకు నువ్వే మిగులుతావు

గుర్తుందా.. రాత్రులు నల్లనిక్షేత్రంలో చల్లిన కాంతిబీజాలూ
దినాంతాన సూర్యహస్తాలు ఆకాశపుకొనల అల్లిన స్వర్ణకాంతీ
ఓ సీతాకోక రెక్కల నిశ్శబ్దమూ, చిన్నిపూవుపై నీరెండ మునివ్రేళ్ళ సవ్వడీ
ఇలానే నీ ప్రాణాన్ని తమలోకి ఒంపుకొని నిన్ను ఖాళీ చెయ్యాలని చూసాయి

కానీ, ఉద్వేగాలు సృజించిన ఊహలన్నీ
నేలవాలిన ఆకాశంవంటి పొగమంచై కరిగిపోయాక
పూలరేకులపై నీటిబిందువుల చారికలా నీకు నువ్వే మిగిలావు

పోయేవన్నీపోగా మిగిలేదేమిటనే గణితం అర్థమైనపుడు
అంకెలన్నీ సున్నాలోకి మరలిపోయినట్లు
పోగొట్టుకొన్న ప్రాణాలన్నీ నీలోకే తిరిగి చేరుతాయి

నువ్వే ఇన్ని అయ్యావని,
అయినా నువ్వు నువ్వుగానే మిగిలావనీ స్పష్టంగా తెలిసినపుడు
నువ్వు నీలోనే వాలుతావు.
నిర్మల స్ఫటికంవంటి విశ్రాంతి పొందుతావు

*17, 18.9.2014 ఉదయం 10.48*
*'వివిధ' ఆంధ్రజ్యోతి దినపత్రిక 9.3.2015*
*బ్లాగ్: 9.3.2015*

# బెంగటిలినవేళ

హాస్టల్ నుండి అర్ధరాత్రి ఫోన్ చేసింది అమ్మాయి
"బెంగగా వుంది, డాడీ"

వాళ్ళ తలల మీద ఒకే నక్షత్రాలు కనులు విప్పార్చి చూస్తున్నాయి
ఒకే చలిగాలి ఇద్దరినీ అమ్మలాగా దగ్గరికి పొదువుకొంది
ఏమంత ముఖ్యంకాని శబ్దాల తెరచాపలు తెరిచి
మృదువైన ఆర్ద్రతలోకి కలిసి ప్రయాణించారు కాసేపు

ఆ సమయంలో
ఆ రెండు జీవితాలూ ఒకటికావటంలోకి వికసించాయా
ఒకే జీవితం రెండుగా వికసించిందా

. . .

తెలియని యే చోటినుండో ఆమె భూమ్మీదికి వచ్చినపుడు
అతనిలో అంతకుముందు ఎరుగని ఆకాశమూ
దానినిండా ఆనందమూ ప్రవేశించాయి

ఈ జీవి ఎవరు, ఈమెకీ, నాకూ బంధమేమిటి
ఈమెని చూసినపుడల్లా
కడుపులో ఆనందమో, దయో అలల్లా ఊగటమేమిటని
అతనికి ఆశ్చర్యం కలుగుతూ వుంటుంది
మొన్ననే భూమ్మీద బాతునడకలు మొదలుపెట్టిన అమ్మాయి
ఇంత పెద్దది ఎపుడయిందని విస్మయంగానూ వుంటుంది

అతన్ని కొనసాగించటానికి ఆమె వచ్చిందో
ఆమె కొనసాగటానికి అతన్ని ముందుగా తెచ్చుకొందో
వాళ్ళకి తెలియనిది వారిద్దరిద్వారా కొనసాగుతోందో చెప్పమని
అతను తనలోని ప్రాచీన మౌనాన్ని ప్రార్థిస్తాడు

లోలోపలి మౌనం పదాల్లోకి వికసిస్తూ
పురాతన విషయమే తాజాగా తెలియచేస్తుంది

. . .

తననించి తాను విడిపోవటం వీలుకాని
ఒకే జీవితం, ఆశ్చర్యం, ఒకే ఆనందంలాంటి దయ
హాస్టల్ గదిలోంచి అతనిలోకి "బెంగగా వుంది, డాడీ" అన్నపుడు

అనేక జీవితాలు లేవనీ, ఉన్నది ఒకే జీవితమనీ
తెలిసిన అతను కూడా "నాకూ బెంగగానే వుంది, తల్లీ" అంటాడు

*2.12.2013 మధ్యాహ్నం 12.21*
*'వివిధ' ఆంధ్రజ్యోతి దినపత్రిక 13.1.2014*
*బ్లాగ్: 14.1.2014*

# అమ్మమ్మ

"అమ్మమ్మా వానపడుతోంది"
ఆరుబయట పక్కలో పడుకొన్న మనవడు ఉలిక్కిపడినప్పుడు
"పడనీరా చల్లగా ఉంటుం"దన్న ఆమె మాట
అతని జీవితానికి చూపునిచ్చింది

వానకి భయపడి ఇంటిలోకి పరుగెట్టనక్కరలేదు
వానలో తడవటం బావుంటుంది
ప్రకృతిలోని అందమంతా కరిగి నీరై పడేవానకి
నిన్ను అర్పించుకోవటం బావుంటుంది

మట్టివాసనల్ని మేల్కొలుపుతూ
ఆర్ద్రతలోకి చల్లగా నడిపించే వానపట్ల,
వానలాంటి జీవితంపట్ల ఉండాల్సింది భయం కాదు, ప్రేమ

. . .

అమ్మమ్మ దేనినీ ధిక్కరించలేదు, ఎవరినీ గద్దించగా చూడలేదు
భూమివంటి అమ్మమ్మ అంత ఉమ్మడికుటుంబానికీ కేంద్రమైకూడా
తనని నేపథ్యంలోనే నిలుపుకొంది

తాతయ్య తడినిండిన మేఘగర్జనలకి బెదురుతున్నట్లుండేది కాని
ఆమె బెదిరేమనిషి కాదని తాతయ్యకి తెలుసు
భయం చివర సమస్తజీవితాన్నీ దీవిస్తున్నట్టు విచ్చుకొనే
ఆమె చిరునవ్వు చూసిన మనవడికీ తెలుసు

. . .

జలధరంలాంటి ఉమ్మడికుటుంబం తెల్లని మబ్బుతునకల్లా చెదిరిపోయి
జీవితసహచరుడూ సెలవుతీసుకొన్న చివరిరోజులలో
కూతురు అమ్మై మ రుణం తీర్చుకొంటున్నపుడు

అగాధమైన మౌనం నిండిన చూపులతో
చివరిరోజులోకి భయంలేక ప్రయాణిస్తున్నట్లుండే
ఆమె జీవస్పందనలని గమనించినప్పుడల్లా
యవ్వనపుతొందరల మధ్యనున్న మనవడు
'అమ్మమ్మ ఏం ఆలోచిస్తుం'దని విస్మయపడుతుండేవాడు

. . .

ఒక ఉక్కపోసే సాయంత్రంలోకి చేరుకొన్న మబ్బులు
చినుకుల్లా కరిగి భూమిని నిశ్శబ్దంగా తాకుతుంటే
గదిలోంచి బయటకు వెళుతున్న మనవడితో ఆమె
"ఏమిటది, వానపడుతోందా" అన్నపుడు
అతను ఊహించలేదు, అవి తనతో చివరిమాటలని
ఉక్కపోతతో నిండనున్న జీవితంలోంచి చివరి వానాకాలం వెళ్ళిపోనుందని

. . .

జీవితం అమ్మమ్మలా దయగలదీ, ఓర్పునిండినదీ కాదని తెలుసుకొంటున్నా
దానిని ప్రేమనిండిన చిరునవ్వుతో ముగించటమెలాగో
ఆమె నీడలో పెరిగిన కూతురుకొడుకు నేర్చుకొన్నట్టే ఉన్నాడు
కనుకనే, దుఃఖపూరిత జీవితానుభవాన్ని దయగల పదాల్లోకి అనువదిస్తున్నాడు

*31.3.2014 ఉగాది మధ్యాహ్నం 12.45*
*తానా పత్రిక డిసెంబర్ 2014*
*బ్లాగ్: 30.8.2014*

# నివాళి

నువ్వు వచ్చావని గుర్తుపట్టినట్టు తలవూపింది ఆమె
ఈ లోకంలో చివరి నిముషాలలో చివరి విశ్రాంతిలో వుంది
ఏయే నవ్వుల వెనుక ఏయే విషాదాల్ని దాచవచ్చో
ఆమె ముఖంలో పలుమార్లు దర్శించావు జీవితం పొడవునా

ఆమె ఎంత అమాయకురాలో
ఆమెని గాయపరిచిన ఎవరెవరు ఎంత అమాయకులో
అందరినీ గాయపరుస్తున్న జీవితమెంత అమాయకమో
కాలం కన్నీటినదిపై నీ పడవప్రయాణంలో తెలుసుకొంటూనే వున్నావు

రాత్రి ఒక నిశ్శబ్ద, ఏకాంత సమయంవెంట ఆమె స్వేచ్ఛపొందింది
పెళుసుబారిన జీవితాన్ని చిట్లించుకొని పక్షిలా ఎగిరిపోయింది

ఏమమ్మా, జీవితమంటే ఏమిటి, మృత్యువంటే ఏమిటి
జలజలా రాలుతున్న ఈ కన్నీళ్ళకి అర్థమేమిటి

(ఒక స్త్రీమూర్తి స్మృతిలో)

*5.10.2012*
బ్లాగ్: *29.5.2015*

# ఒక మధ్యాహ్నం, ఆమె

నా గదిగోడలూ, వెలుపలి చెట్లూ, వాటిమీది మధ్యాహ్నపు ఎండా
మనుషుల భయాలూ, అవి సృష్టించే అడవినీడల్లాంటి ఊహలూ, వ్యూహాలూ
యధావిధిగా భద్రంగా ఉన్నాయని నమ్ముతున్నవేళ ఆమె ఫోన్ చేసింది

"మీ కవిత్వం చదివాను, మీ ఊహలన్నీ ఇంతకుముందే ఊహించాననిపిస్తోంది
నేను గతంలో ఉన్నానా, మీరు భవిష్యత్తులో ఉన్నారా" అని అడిగింది
నాకూ అర్థంకాని సమాధానమొకటి చెప్పి
నన్నొక నైరూప్యకవితలోకి నడిపిస్తున్న ఆమె మాటల్ని వింటున్నాను

ఏ కొండమీది బౌద్ధాలయంలోనో ఖణాలున మ్రోగిన గంటారావం
ప్రశాంతసమయంలోకి ప్రశాంతంగా కరిగిపోతున్నట్లు
స్వచ్ఛ శ్రావ్య కంఠస్వరంనుండి వికసించిన మాటలు నాలో కరిగిపోతున్నాయి

"నేను ఉదయం నిద్రలేస్తానా, నాలోంచి ఎందరెందరో వెళ్ళిపోతుంటారు,
ఏవో చెట్లూ, జంతువులూ కూడా, అన్నీ వెళ్ళిపోయాక నేను లేస్తాను"

నా వెలుపలి, లోపలి ప్రపంచాలని చెరిపేస్తూ
నాకు తాజా చూపునీ, ఊహనీ ప్రసాదిస్తూ ఆమె చెబుతూవుంది
"కొన్నాళ్ళు ఎక్కడికో వెళ్ళిపోయాను, గదిలో పెట్టి తాళం వేసారు కొన్నాళ్ళు
పిచ్చి అన్నారు కొందరు, నాకేమీ అర్థం కావటం లేదు, చెప్పండి నాకు పిచ్చివుందా"

ఇంత నిసర్గమైన మాటలు విని ఎన్నాళ్ళయింది
నిర్మలమైన, దయ పుట్టించే కంఠం విని ఎన్ని రుతువులు గడిచాయి

అనాది అమాయకత్వపురాశి నుండి
నా వంతు పంచుకొని అనుభవించిన బాల్యంలోని
కంఠస్వరమూ, అమాయకత్వమూ ఆమె మాటల్లో చూసుకొంటున్నాను

"లేదమ్మా, నువు ఆరోగ్యంగా ఉన్నావు,
నీ ఊహలు, నీ వాస్తవం కన్నా శక్తివంతంగా ఉండటం మినహా నువు బావున్నావు"

ఎక్కడి ఆమె, ఎక్కడి నేను, ఏ జన్మాంతరాల దయగల బంధం
ఏ తల్లీబిడ్డల, తండ్రీకూతుళ్ళ బంధం ఇవాళ మా మధ్య మేలుకొంది
"భగవంతుడు నిన్ను చల్లగా చూస్తాడమ్మా" నా చివరిమాటతో సంభాషణ ముగిసింది

భగవంతుడు లేకున్నా
ఆ దయనిండిన క్షణాలనుండి పుట్టే వుంటాడు
ఆమెని చల్లగా చూస్తాడు

. . .

భద్రమైన భయాలతో బ్రతుకుతున్న నా ప్రపంచం మంచిదా
భయమెరుగని అమాయకత్వం నిండిన ఆమె ప్రపంచం మంచిదా

నా గదివెలుపల గోడలమీదా, చెట్లమీదా వాలుతున్న మధ్యాహ్నపు ఎండ
జీవితాన్ని కాసేపు వెలిగించి మరికొన్ని నీడలు మిగుల్చుతూ మాయమవుతోంది

*18.3.2013 మధ్యాహ్నం 2.25*
*బ్లాగ్: 20.5.2014*

# తలుపులు తెరిచి..

వెలుతురు కిరణాలని పూలరేకుల్లా మలచి
ఏ నీడలకీ వాడిపోకుండా అరచేతులలో కాపాడుకొన్నట్లు
ఆమెని పెంచారు అమాయక ప్రేమికులు ఆమె తల్లిదండ్రులు

మెరిసే కత్తిమొనకీ, మంచుబిందువుకీ భేదం తెలియని ఆమె
భ్రమలు చూపిన చీకటిస్వర్గంలోకి తటాలున జారిపోయింది

ఆమె తల్లిదండ్రులని చూసాను, అప్పటినుండీ చూస్తూనే ఉన్నాను
కాంతిలేని చూపులూ, ఉత్సవంలేని నవ్వులూ
ఎవరితో ఏం మాట్లాడుతున్నా మాటలన్నిటి వెనుకా ఆమెకోసం వెదుకులాటా
ప్రతిదినమూ తెలియని వెలితిని నింపుకొనే దు:ఖమయ విఫలయత్నమూ

ఇప్పుడు వాళ్ళు మృత్యువు వెనుక నడుస్తుంటే జీవితం దయగా అనుసరిస్తోంది
తమని తాము తప్పించుకోవాలని విరామంలేని పనుల్లోకి వాళ్ళని ఒంపుకొంటూవున్నారు

ఇవాళ ఎక్కడో పనిచేస్తున్న ఆమెని చూసాను
ఈ పగటి ఎండనిండా దుమ్మూ, జీవనవ్యాకులతల రొదా
పగటిలో సారాన్నీ, తాజాదనాన్నీ పోగొట్టుకొంటూ ఆమె
ఎన్నడూ లేనిది ఆమెపై కాస్తంత దయ కలిగింది

. . .

ఈ కథ ఏ మలుపులు తిరగనుందో
కథ చివర ఎలాంటి చిరునవ్వులుంటాయో తెలియదు కానీ,

పిల్లలు గొప్ప స్వర్గాన్ని రుచి చూపిస్తున్నపుడు
కాస్త జాగ్రత్తగా ఉండాలి
గొప్ప నరకం దానిని కాపలా కాస్తుందనే మెలకువ వుండాలి

లోకంలో బలంగా వేళ్ళూనుకోవద్దు
కాస్త తేలికగా నీటిమీద నడిచినట్లు వెళ్ళిపోతూవుండాలని
మిత్రులకి చెప్పే నెపంతో నాకు చెప్పుకొంటాను చాలాసార్లు

పిల్లలు కావచ్చు, ప్రియమైనవి ఏమైనా కావచ్చు
వాటిని రానివ్వటానికి విశాలంగా తెరిచిన తలుపుల్ని
పోనివ్వటానికి కూడా విశాలంగా తెరిచే ఉంచాలనుకొంటాను

బహుశా, సుఖం వాళ్ళు రావటంలో, దు:ఖం వెళ్ళటంలో లేవేమో
తలుపులు తెరిస్తే లోనికి వచ్చిన వెలుతురునీ, సుఖాన్నీ
తలుపులు మూసి దాచుకోవాలని చూస్తున్నామేమో

బహుశా, మనల్ని వెలుతురు కిరణాలుగా మలుచుకొన్న జీవితం
మన అనుమతి లేకుండా తలుపులు తెరిచి
దాచుకోవటం దు:ఖమనీ, తెరుచుకోవటం సుఖమనీ చెవిలో చెప్పబోతుందేమో

*11.2.2013 మధ్యాహ్నం 1.42*
*ప్రస్థానం మార్చి 2013*
*బ్లాగ్: 6.3.2013*

# అక్షరాశ్రమం

సముద్రంపై ఎగిరి ఎగిరి మళ్ళీ నౌకపై వాలిన పక్షిలా
లోకమంతా తిరిగి అక్షరాలపై వాలతావు
నీకెంత మేలు చేస్తున్నాయో ఎపుడూ గమనించలేదు కాని
భూమ్మీద అక్షరాలు మినహా తోడెవరూ ఉన్నట్టులేరు

దుఃఖంలోకీ, వెలితిలోకీ ఘనీభవించినపుడు
ఏ శూన్యం నుండో పుట్టిన కిరణాల్లా అక్షరాలు
ఉద్విగ్న హృదయాన్ని చేరి మెల్లగా నిన్ను కరిగిస్తాయి

ఇంత దయా, శాంతీ నీ అక్షరాలకెలా సాధ్యమని
మిత్రులు విస్మయపడుతున్నపుడు ఆలోచించలేదు కాని
వాటిని ఆశ్రయించే క్షణాల్లో ఏదో దివ్యత్వం
దుఃఖాన్ని దయగా, వెలితిని శాంతిగా పరిపక్వం చేస్తున్నట్లుంది

ఇప్పుడు ఒక్కొక్క అక్షరమూ ఒక్కొక్క అద్దంలా కనిపిస్తోంది
అద్దాలని అతికినప్పుడల్లా
నీలో ముక్కలైనదేదో అతుక్కొన్న ఊరట కలుగుతోంది

ఒక్కొక్క అక్షరమూ ఒక్కొక్క నక్షత్రంలా కనిపిస్తోంది
కాసిని నక్షత్రాలని ప్రోగుచేసుకొన్న ప్రతిసారీ
పిపీలికంలా మసలే నువ్వు పాలపుంత వవుతున్నట్లుంది

ఒక్కొక్క అక్షరమూ ఓ కన్నీటి బిందువవుతోంది
కాసిని కన్నీళ్ళని జారవిడిచిన ప్రతిసారీ
గర్వమో, స్వార్ధమో, మరొక చీకటో కరిగి

మామూలు మనిషి దేవుడవుతున్నట్లుంది
జీవితం ప్రార్ధనా గీతమవుతున్నట్లుంది
ఎన్నటికీ మరణించనిదేదో లోలోపల వెలుగుతున్నట్లుంది

*17.02.2014 రాత్రి 8.30*
*తెలుగు వెలుగు డిసెంబర్ 2014*
*బ్లాగ్: 3.12.2014*

# కవిని చూద్దామని

కవి ఎలావుంటాడో చూద్దామని అతనింటికి వస్తారు

అక్షరాలకి జీవంపోసి దయ నింపేవాడూ,
పదాలని శుభ్రంచేసి సౌందర్యం అద్దేవాడూ
వాక్యాలని నిద్రలేపి స్వప్నసంచారం చేయించేవాడూ

దయగా, అందంగా, చురుకుగా ఉండివుంటాడని
లోపలి కవిని వెలుపల ధ్రువపరచుకోవడానికి అతన్ని చూడబోతారు

రోజూ చూసే ఇంటిలోని, వీధిలోని మనుషుల్లో ఒకడుగా వాళ్ళకి ఎదురౌతాడు
కాస్త నమ్రతా, గర్వం, మరికాస్త జాలీ, కోపం, కొంచెం లౌక్యం, కొంచెం భోళా
ఎపుడూ చూసే నమూనాల్లో ఒకడుగానే కవి వాళ్ళతో మాట్లాడతాడు

ఇతనూ మనలాంటివాడే కదా అనుకొంటూ
భ్రమలు చిట్లిన నవ్వొకటి నవ్వుకొంటారు
రాస్తున్నది ఇతను కాదు, ఏ దివ్యభావాలో వశపరచుకొని, వాహిక చేసుకొన్నాయని
తాజా సమాధానంలోకి నిదానంగా తేటపడతారు

కవిని నిజంగా ఎవరు కనిపెట్టగలరు
పైపై నడతల నివురువెనుక తేజోరాశిని ఎవరు తాకగలరు
తన అగ్ని ఎవరినీ దహించరాదనే దయతో నటిస్తున్నాడనీ,
నిదానంగా ఫలదీకృతమౌతున్న ఊహల్ని మట్టిపొరల వెనుక దాస్తున్నాడనీ ఊహించగలరు

అతనిలాంటి కవి మినహా, పాఠకుడు మినహా
అతని అంతరంగంలోకి సునాయాసంగా ఎవరు చొరబడగలరు

అందుకే చూడవచ్చిన వాళ్లకి వీడ్కోలు చెబుతూ
"మీరు రావటం సంతోషం, మళ్ళీ కలుద్దాం"మని అంటున్నపుడు
అతని కళ్ళవంక ఎపుడూ చూడకండి
తనని చూడలేకపోయారన్న బెంగ వాటిలో ముసురుకొని వుంటుంది

*5.10.2012*
*బ్లాగ్: 21.11.2012*

# వర్ధమాన కవికి

కవీ, నీ పాత్రలో కొద్దిపాటి నీరు చేరగానే
దానినే గలగలలాడించి సెలయేరని భ్రమింపచెయ్యకు
నీ ముందు, నదుల్ని తాగి ఏమీ ఎరుగనట్లు చూస్తున్నవారుంటారు

ఎడారిలో బావి తవ్వాలని చూడకు,
ఎంత దూరమైనా ప్రయాణించి, ఎన్ని పగళ్ళు, రాత్రులకైనా తలవొంచి
ఒక నదిని కనుక్కో ముందు

ఎడారి ఏది, నది ఏదని అడగకు, నీ అడుగులు అక్కడ మొదలుపెట్టు

ఒక పువ్వు, పసినవ్వు, ఒక దుఃఖాశ్రువు, వానచినుకు
ఏదైనా ఒకే ఒకటి నీ జీవితాన్ని తలకిందులు చేయకపోతే
వాటిలో నదిలోకి దూకినట్టు దూకలేకపోతే
వేలకొద్దీ పూలూ, అశ్రువులూ ఏవీ నిన్ను కదిలించలేవు

ఇపుడు గుట్టువిప్పుతున్నాను, ఒక పువ్వు నది, వేల పువ్వులు ఎడారి

నీ దగ్గరున్న శబ్దాలను కాగితంపై పేర్చటమే కవిత్వం అనుకొన్నంతకాలం
ఒక్క కవితైనా చెప్పలేవు
నీ నిశ్శబ్దంలో కొంత శబ్దాలలోకి అనువదించడం కవిత్వం

ఎపుడైనా గమనించావా నీలో నువ్వు మాత్రమే వినగల నిశ్శబ్దాన్ని
నువ్వు మాత్రమే ప్రవేశించగల నీ నిజ ప్రపంచాన్ని

నీ అక్షరాలు కాగితంపై ఆకారం దాల్చకముందే
నీ చెవిలో చప్పట్లహోరు వినబడుతుంటే,
నిజం చెబుతున్నాను నమ్ము, నువ్వు ఎప్పటికీ కవిత్వం రాయలేవు
ఏ స్త్రీనీ ప్రేమించలేవు, నీకెప్పటికీ జీవితమైనా మొదలు కాదు

కవిత్వాన్ని వెలిగించే అగ్నికోసం, బయట వెదికేవారికి
పొగమంచులో తడిసే ప్రపంచం మినహా ఏమీ కనిపించదు
నిన్ను నీకు కనబడనివ్వని పొగమంచులోకి
నిర్భయంగా చేతులు చాచినపుడు నీవే అగ్నివని గుర్తిస్తావు
చూస్తున్నావా దృశ్యం అగ్నిమయమై గోచరిస్తుంది, అక్షరాలు వెలుగుతున్నాయి

కఠినమైన రహస్యాలను దయ బయటపెట్టినపుడు
సముద్రమంత హోరు అకస్మాత్తుగా ప్రజల్ని కౌగలించుకొంటుంది
అప్పుడా రహస్యాలను భవిష్యస్వప్నాలను నిర్మించే ఉత్సాహవంతులు వినగలుగుతారు
రహస్యాలని రహస్యంగా తెలుసుకొని వారు, సూర్యకాంతిని వెలిగించే చీకట్లోకీ
చీకటిని వెలిగించే కన్ను ఎరుగని కాంతిలోకీ అందరితో మాట్లాడుతూ వడివడిగా నడుస్తారు

వేలకొద్దీ నేనులు మాయమై, ఒక నేనే వేల ప్రతిబింబాలయిందని కనుగొన్నపుడు
కవికి తన కవిత్వం రాయటం పూర్తవుతుంది

. . .

కవిత్వాలకేం గానీ, హాయిగా నవ్వుకొందాం కాసేపు
మనం చేయలేని చాలా పనులు నవ్వులో దాగొన్న దేవతలు చేస్తారు

*7.8.2012*

బ్లాగ్: *7.8.2012*

# పావురాలు

తెల్లనికాగితంపై రంగులు వాలినట్టు
నీ ప్రశాంతతలోకి
ఏవో మృదువైన స్పందనలు వచ్చి వాలతాయి

పావురాలు గింజల్ని నోట కరుస్తున్నట్టు
ఈ స్పందనలు నీ క్షణాల్ని నోట కరుస్తాయి
అలా చూస్తుంటావు పావురాల కువకువలని

ఈ పావురాలు ఎగిరేందుకు పుట్టినవికావు
వాలేందుకే లోకంలోకి వచ్చాయి

కాస్త నీడా, కాస్త శాంతీ ఉన్నచోట వాలి
నీడలాంటి శాంతిలోకి వృత్తంలా మరలి
నీడకి రూపం వచ్చినట్టూ,
శాంతికి ప్రాణం పోసినట్టూ సందడి చేస్తాయి

ఈ పావురాలు అందుకే వస్తాయి
ఇవి నిశ్శబ్దాన్ని విప్పి శబ్దాలు వెదజల్లవు
శబ్దాలను విప్పి నిశ్శబ్దాన్ని పంచిపెడతాయి

*16.4.2013 రాత్రి 10.00*
*ఈమాట.కాం జులై 2013*
*బ్లాగ్: 3.8.2013*

# మధ్యాహ్నపు నీడ

ఈ మధ్యాహ్నం నిదానంగా విస్తరించే నీడని చూస్తున్నపుడు
దయాగుణమేదో కవిత్వంలా మెల్లగా కనులు విప్పుతోంది
నిద్రచాలని రాత్రిని ఈదుకొంటూ వచ్చి
పగటి దృశ్యరాశిని ఆలోచనలలో పోగొట్టుకొంటున్న నన్ను
ఈ నీడ స్నేహితునిలా పలకరించింది

పగలొకటే చాలనీ, రాత్రికి లోకంతో పనేముందనీ
పోరాటం జీవితమనీ, శాంతికి చోటులేదనీ వాదించే మిత్రులతో
రెండూ సమానమనీ, ఒకదాన్నొకటి నింపుకొంటాయనీ
ఒకటి కోల్పోతే, రెండూ కోల్పోతామనీ ఒప్పించలేని అశక్తతకి నవ్వుకొంటున్నపుడు

పగటి వెలుతురుమహల్లోకి రాత్రి పంపిన అతిథిలా ప్రవేశిస్తున్న మధ్యాహ్నపు నీడ
నువ్వూ నాలాంటివాడివంటూ మృదువుగా మాట కలిపింది

నల్లనిరాత్రిలానో, తెల్లనిపగటిలానో తనకో రంగునేమీ మిగుల్చుకోని నీడ
గర్వం నుండి ప్రేమకీ, ఉద్వేగాల నుండి స్పష్టతకీ ప్రయాణించే
నా అక్షరాల్లానే, నాలానే బహు పలుచని ఉనికిని మిగుల్చుకొంటూ సమీపించింది

నను కన్న జీవితం ఒంటరినయ్యానని తలచేవేళల తోడుంటుందని సృష్టించినట్లు
ఈ మధ్యాహ్నపు నీడ నెమ్మదిగా దయలాగా తాకింది నన్ను

*29.3.2013* మధ్యాహ్నం *2.55*
న్యూఆవకాయ.కాం *5.5.2013* బ్లాగ్: *12.5.2013*

# దీపం వెలిగిస్తూ..

నిజం, నీ చుట్టూ నవ్వులున్నాయి, నవ్వలేకపోవటముంది
కన్నీరుంది, కన్నీరు ఆవిరైపోవటముంది
కోట్ల జీవుల అలజడులు, ఆనందవిషాదాలు,
భయాలు, బెంగలు, సందేహాలు, సందిగ్ధతలున్నాయి

నడిసముద్రంలోని ద్వీపంలా
వీటిమధ్య నువు మాత్రమే బ్రతకాల్సిన జీవితమొకటుంది
చాతనైనంత నిండుగా బ్రతికిచూపే బాధ్యతవుంది
ఎలా జీవించాలో, ఎలా అవసరంలేదో
మాటకన్నా ముందు పాదాలు నడిచి చూపాల్సివుంది

హుందాగా, బిడియంగా పూలలా వికసించే కోరికలతో
కలలన్నీ కన్నీరై రాలినా లోటులేని చిరునవ్వు నవ్వుతూ
ఏ దిగులూ తాకలేని జీవనానందంతో మెరిసేముఖంతో
కాస్త వినమ్రంగా, సరదాగా భవితలోకి వెళ్ళటమొకటుంది

. . .

నేనూ ఎదిరిస్తాను మనుషుల్లోని అమానుషాన్ని
మరింత తీవ్రంగా, బలంగా, లోతుగా
నువ్వు ధనికులని నిందిస్తున్నపుడు వాళ్ళ ధనాన్ని చులకనచేస్తాను
వారి నల్లనివిజయాలు జీవించటాన్ని కోల్పోయిన ఫలితాలని వ్యాఖ్యానిస్తాను

వాళ్ళు సృష్టించే భయోన్మత్త విపణివీధుల మాయాజాలం నుండి
నా వాళ్ళని వెన్నెల్లోకీ, వేసవిలోకీ, చెట్ల ఋతుగానాల్లోకీ

క్షణక్షణమూ తాజాగా మేలుకొనే ఆకాశంలోకీ, ఆశ్చర్యంలోకీ
ఏకాంతవేళల వికసించే లోతులెరుగని మౌనంలోకీ
ఎవరి దయా అక్కర్లేని పరమనిర్లక్ష్యంలోకీ ప్రశాంతంగా నడిపిస్తాను

నీకూ, నాకూ మధ్య భేదాలన్నీ వట్టి భయాలు కట్టిన తెరలని
అలలునిజం కాదనీ, మనం సముద్రజలమనీ మౌనంగా తెలియచేస్తాను
ఇందరిలోని ఆర్ద్రత నా ఆత్మబంధువనీ, స్వేచ్ఛ నా నేస్తమనీ
నిరపేక్షసత్యం అందరినీ నడిపించే గురువనీ నిష్కపటంగా నమ్మిచూపిస్తాను

ఎవరెవరిలోనో నచ్చనిదానిని నిందిస్తూ ద్వేషంతో
నువ్వు జీవించటాన్ని చీకటి చేస్తున్నపుడు
అందరిలో ప్రేమించవలసిన వెలుతురుని వెదుకుతూ, తాకుతూ
నువ్వు నిందిస్తున్న చీకటిలో దీపం వెలిగించాలని చూస్తాను

*16.10.2012*
*బ్లాగ్ : 28.7.2014*

# మరొక ఉదయంవేళ

జీవితం తననెందుకు కన్నదని అతనాలోచించాడు
మరొకరి శ్వాసవల్ల బ్రతికేందుకు తానొక నీడ కాననీ
ఈ ఉదయం ప్రభవించిన కిరణంలాంటి వాడిననీ అనిపించింది
కిరణాలు స్వయంగా పుడతాయనీ, పుట్టించేవేవైనా నీడలై మిగులుతాయనీ తెలిసింది

తనని తనలాగే నవ్వమనీ, ఏడవమనీ, కోపించమనీ, దీవించమనీ జీవితం కన్నది
అంతులేని మోహం పుట్టించే జీవితం
అతని అనుభవం కోసమే అతని ప్రపంచాన్ని సృష్టించి ఉంచింది

తనదైన చూపుతో ఈ ఇంద్రియజాలం చూడమనీ
తనదైన దేహంతో, ఆకలితో, ప్రశ్నలతో లోకం తిరగమనీ
ఎవరూలేనిచోట తనదైన చిరునవ్వునీ, కన్నీటినీ పదిలపరచమనీ
వెళ్ళేటపుడు వెలుతురునో, చీకటినో, లేదంటే ఖాళీనో కానుక చెయ్యమనీ
చెప్పి మరీ సృష్టించుకొంది

. . .

జీవితం తననెందుకు కన్నదో కళ్ళు తెరుచుకున్నాయతనికి
తన నియమాలు తనవారినెలా బాధిస్తాయో, వాటిమధ్య బంధితుడై
తాను ఎలా కమురుగాలి శ్వాసిస్తాడో మరోసారి చెప్పింది జీవితం

నిన్నటి స్వేచ్ఛాసూత్రం ఇవాళొక క్రొత్తసంకెల అవుతుందనీ
ప్రవాహాన్ని జీవించడమంటే ప్రవహించటమనీ
తెరుచుకొన్న కళ్ళముందు వాలుతున్న వెలుతురులా తెలిసింది అతనికి

ఇప్పుడతనికి బోధపడింది
భూమిని ఆకాశానికి చేర్చే పర్వతాలు ఏ రెండూ ఒకలా లేనట్లే
ఇవాళ భూమిలోంచి స్వేచ్ఛపొందిన లేతచివురు లే రెండూ ఒకలా వుండవని

ఏ పర్వతం పొగరుకన్నా, ఏ చిగురు పొగరూ
రవంత తక్కువ పరిమళభరితం కాదని, సౌందర్యంలో తీసిపోదని
పర్వతాన్ని సృష్టించినప్పటికంటే
శ్రద్ధగా, అపురూపంగా జీవితం లేతచిగురుని సృష్టించిందని

వినమ్రుడై ధరణికి తలవాల్చి చూస్తే
లేతచిగురు కూడా పర్వతంకన్నా ఎత్తున కనిపిస్తుందని

. . .

ప్రతి నశ్వరదృశ్యమూ, పలుచనిగాలిలా చలించిపోయే ప్రతిక్షణమూ
ఆనందోన్మత్త అగాధ భూమికలనుండి అంతుతెలియని దు:ఖంతో
ఇదే తొలికానుక అన్నట్టు, ఎప్పటికీ శాశ్వతమన్నట్టు తాను సృష్టించుకొందని
అతని స్వచ్ఛతలో ప్రవేశించి జీవితం బోధపరిచింది
అతనిలో తన ముఖం సరిచూసుకొని దయగా నవ్వుకొంది

గతించిన అనేక ఉదయాల, రానున్న ఉదయాల తాత్పర్యమేమిటో
తననీ, ఇతర్లనీ, ఇన్ని ద్వంద్వాలనీ జీవితమెందుకు కన్నదో
అమాయకత్వంలా, ఆకాశంలా విచ్చుకొన్న ఈ ఉదయం అతనికి బోధపడింది

*28.3.2013 ఉదయం 11.35*
*'సాహితి' ఆంధ్రభూమి దినపత్రిక 22.4.2013*
*బ్లాగ్: 22.4.2013*

# గంధర్వుడు ఒకడు

గంధర్వుడు ఒకడు వచ్చివెళతాడు
చుట్టూవున్న శూన్యంలోపలి లోకంలోంచి మెరిసేజీవి ఒకడు మనకోసం వస్తాడు
అతన్ని భూమి గుర్తించదు, భూమి మేలుకొంటున్న పరిమళం గుర్తిస్తుంది
అగ్ని గుర్తించదు, అగ్నినుండి రెక్కలు విప్పుకొనే రంగులు గుర్తిస్తాయి
అక్షరాలు గుర్తించవు, వాటిపై అదృశ్యంగా సంచరించే ఊహలు గుర్తిస్తాయి

మరపుగుహల్లో నిదురిస్తూ నడిచే మనం
"ఇతను మనలాంటి వాడే కదా, భయ, కాంక్షా, వ్యాకులత లున్నవాడే కదా" అన్నపుడు
చెట్లు నెమ్మదిగా కలగంటున్న పచ్చదనమూ,
పక్షుల రెక్కలపై విహరించే స్వేచ్ఛాకాంక్షా మనపై జాలిపడతాయి
"ఇతని భయ, కాంక్షా, వ్యాకులతల పారాడే దయ మీకు తెలియలే'దని తలుస్తాయి

. . .

అతను నవ్వుతూ, కవిత్వం చెబుతూ
తలుపుల వెనుకనున్న మనపైన ప్రేమ కలిగి సుతారంగా వాటిని తడతాడు
చిరుగాలైనా వీయలేదే ఈ సడి ఎక్కడిదని తలచేలోపు
బంగారుకిరణంలా నిశ్శబ్దంగా మరలిపోతాడు

అతను వచ్చి వెళ్ళాడని మనకి తెలియదు కాని, హృదయానికి తెలుస్తుంది
జీవితేచ్ఛలా అణగారి వెలిగే అంతరాత్మకి తెలుస్తుంది

మూసిన గదిలో చొరబడే చల్లదనంలా మనలో ప్రవేశిస్తాడు,
అంతరాత్మతో సంభాషిస్తాడు, అనుమతి లేకున్నా కాస్త వెలుతురు ప్రవేశపెడతాడు

అతనేదో చేసాడని, మాట్లాడాడని తెలుస్తుంది కాని
ఏంచేసాడో, మాట్లాడాడో రహస్యంగా వుండిపోతుంది

. . .

ఆకాశంలోపలి రహస్యదేశాలజీవి ఒకడు వచ్చివెళతాడు
కాసిని రంగులో, స్వరాలో, అక్షరాలో ఉపయోగించి
వెలుతురులోకం చిరునామా చెప్పబోతాడు
అతడుత్సాహంగా "అదిగో చూ"డన్నపుడు
తన వేలికొస చూపించే లోకాన్ని చూడలేకపోతాము
మన కళ్ళని మూసిన అరచేతుల చీకటిని విదిలించలేకపోతాడు

మనం సంతోషించేవాటికి దు:ఖిస్తాడు, దు:ఖించేవాటికి చిరునవ్వు నవ్వుతాడు
పొరలోపలి పొరలలోని ఉల్లిఘాటువంటి మన "నేనే, నేనే"లను చూసి
దు:ఖంతో, జాలితో చల్లటి చూపులు కురిపిస్తూ వచ్చినచోటికి తరలిపోతాడు
వాన తరువాత వ్యాపించే ప్రశాంతనిశ్శబ్దం వెంట తన లోకం చేరుకొంటాడు

. . .

గంధర్వుడొకడు వస్తాడు, వెళతాడు, ఎప్పటిలా సూర్యాస్తమయమౌతుంది
దిగులుపాటలు మోసుకొంటూ పిట్టలు చీకటిలో కరిగిపోతాయి
చీకటికై రోదసినిండా వేచిన శక్తులు
మనతో చిరంతన సంభాషణ మళ్లీ మొదలుపెడతాయి
వాటిని హత్తుకొని మరొక్కసారి నిదురలోపలి నిదురలోనికి జారిపోతాము

గంధర్వుడు వచ్చివెళ్ళిన జాడలేవో మనని కోమలంగా తడుతుంటాయి
మన లోలోపలి స్వప్నాలను పొదువుకొని కాపాడుతుంటాయి

*29.7.2012*

బ్లాగ్: *29.7.2012*

# పసిదనపు స్వర్గం

దైవంలాంటి ఉదయం పసిదనపు స్వర్గంలోని పిల్లలు
కవిని చేరి, "మా గురించి కవిత్వం రాయ"మని ఆజ్ఞాపించారు
ఆనందసముద్రంలో ఆల్చిప్పల్లా విచ్చుకొన్న వారి కళ్ళల్లో
ఆశ్చర్యాల ముత్యాలు ఊగుతున్నాయి

ఏం రాస్తాడు కవి, వాళ్ళపై కవిత్వం రాయటానికి వాళ్ళలా కావాలి
ఇన్నాళ్ళూ సేకరించుకొన్న భయాలనీ, జ్ఞానమని భ్రమించే జ్ఞాపకాలనీ విడిచి
సూర్యకిరణాల తీగెలపై తేలికగా సంచరించాలి

తీసుకోవటమే కాని, ఇవ్వటం మరిచిన
చీకటిదారుల ఇరుకుగుహల్లో కవి చాలా దూరం నడిచివచ్చాడు

"రాయలేను, మన్నించండి, నా అమాయకత్వం చాలాకాలం క్రితం అదృశ్యమయింది
నేను ఆనందాన్ని ఆనందించడం మరిచిపోయాను, జీవితాన్ని జీవించడం మానేసాను
దేనినీ పట్టించుకోని సాహసపు విద్యుల్లతను మూలకు విసిరేసాను
అందంలో, ఆర్ద్రతలో అలవోకగా కరిగిపోయే ద్రవమేదో నాలోంచి ఆవిరైపోయింది

నేనిపుడు అలవాట్లూ, ఆలోచనలూ జీవిస్తున్నాను,
ఉద్వేగాలనీ, గాయాలనీ పూజిస్తున్నాను
నన్ను శకలాలుగా చూసుకొని మురిసిపోయే తెలివితేటల బాటల్లో
అందరికన్నా ముందుకు దూసుకుపోతున్నాను

పిల్లల్లారా, మన్నించండి, నాలో మరకవలే మిగిలిన పురాస్మృతి ఏదో
మీలోంచి మొరటుదనంలోకి తరలిపోయానని చెబుతోంది
నా జీవనానందం బెరడు కట్టిందని విసుక్కొంటోంది

మీపై కవిత్వం రాయలేను, ఇక పసిదనపు స్వర్గంలో అడుగుపెట్టలేను"

కవిచుట్టూ ఆవరించిన స్వప్నగోళంలోని పిల్లలు,
రంగుల్లా, పరిమళాల్లా, రుచుల్లా జీవితోత్సవం నిండిన పిల్లలు
రుతువులతో రూపంమార్చే ఆకాశంలా జీవితంలోకి జీవించటం నింపే పిల్లలు
కేరింతల్లా, కన్నీటిజడుల్లా ఇది జీవితం మినహా మరేం కాదని ప్రకటించే పిల్లలు

దయగా అతన్ని కౌగలించుకొన్నారు, తలపై నిమిరారు
అరక్షణం అమాయకత్వం విడిచి అర్థవంతమైన వెన్నెల చూపులతో అభిషేకించారు

కవి ఇపుడు కన్నీటి శిఖరమయ్యాడు,
తల వాల్చి, కనురెప్పలు వాల్చి, లోలోపలి ఉద్రేకాలు రాల్చి
ఎగిరిపడే వేల గర్వాల సముద్రపక్షుల్ని
దు:ఖకెరటాలూపి దూరతీరాలకు పంపిస్తున్నాడు

కవిలో దేశాలూ, జాతులూ కరిగి నీరైపోతున్నాయి
వ్యవస్థలూ, తనపరభేదాలూ అర్థాలు కోల్పోతున్నాయి
దు:ఖపు శిలలూ, శిలాజాలూ మంచై, నీరై, ఆవిరై
కాంతికిరణాల వెంట కనిపించని లోకాలకి తరలిపోతున్నాయి

పిల్లల కాంతిగోళం, కవి యుగాల జీవితాన్ని రద్దుచేసి
మెలకువలోకీ, మెలకువలాంటి తాజాదనంలోకీ
క్షణంలా తేలికా, శాశ్వతంలా స్థిరమూనైన జీవితంలోకి తీసుకొచ్చింది

పసిదనపు స్వర్గం అతన్ని పచ్చని ఆకునీ, పత్రహరితాన్నీ చేసింది
పూవునీ, పూలరంగుల్నీ, పరిమళాన్నీ, వికాసాన్నీ చేసింది

పక్షినీ, పాటనీ, పక్షిరెక్కల చుట్టూ విచ్చుకొన్న వినీలగగనాన్నీ చేసింది

అతనికి ఆశ్చర్యమంత ఆశ్చర్యాన్నీ, ఆనందమంత ఆనందాన్నీ ప్రసాదించింది
నమ్రతగా, కృతజ్ఞతగా ఆ దేవతల ముందు చేతులు జోడించాడు చివరిసారి

అప్పుడు వాళ్ళలో ఒకరు "కవీ, ఇప్పుడు కవిత్వం చెప్పు" అనగా విని
కొత్తగా చేరిన పిల్లవాడొకడు అటూ, ఇటూ చూసి "కవి అంటే ఎవర"ని అడిగాడు
పసిదనపు స్వర్గం పకాలున నవ్వుల్లో మునిగి, అక్షరాలని విడిచి ఎటో ఎగిరిపోయింది

*23.10.2012*
*ఆకాశవాణి, విజయవాడ 14.11.2012*
*బ్లాగ్: 14.11.2012*

# పిల్లలూ క్షమించండి..

పిల్లలూ మమ్మల్ని క్షమించండి
భూమి నుండి వేర్లని వేరుచేసి మొక్కని మహావృక్షం కమ్మని శాసించినట్టు
జీవనానందం నుండి మీ చూపు తప్పించి గొప్పవ్యక్తులు కమ్మని దీవిస్తాం

జీవితమంటే హృదయం నుండి హృదయానికి, ఆశ్చర్యం నుండి ఆశ్చర్యానికి
కాలం నుండి కాలంలేని చోటుకి వెళ్ళటమని ఎవరో చెబితే వచ్చారు కాని

జీవితమంటే అందరికన్నా ముందుండటమనే అగ్నిలో దూకటమని
చనిపోయే వరకూ రేపటిలో బ్రతకటమని
మాయావస్తుసముదాయాల మధ్య దారితప్పి తిరగటమని
మీకు పట్టిన సంతోషాన్ని మార్కులతో వదిలించి మరీ నేర్పుతాము

పిల్లలూ మమ్మల్ని క్షమించండి
చదువంటే చూడటమనీ, ప్రశ్నించటమనీ, ఊహించటమనీ
ఆటలనీ, పాటలనీ, పంచుకోవటంలోని పరమానందాన్ని తెలుసుకోవటనీ
చదువంటే తల్లి మెడను కౌగలించుకొన్నట్టు జీవితాన్ని కౌగలించుకోవటమనీ
లోలోపలి జీవితేచ్ఛ మీతో గుసగుసలాడి వుండొచ్చుకానీ

చదువంటే తడినేలని ఎడారి చేసి విత్తనాలు నాటుకోవడమని,
బెరడై కలకాలం బ్రతకాలి కాని,
పూలై, పళ్ళై రసమయలోకాలకి పరుగుపెట్టకూడదని
కోమల హృదయాల్లో జీవరసం ఎండిపోయే వరకూ నేర్పి,
యోగ్యతాపత్రాలు బహూకరిస్తాం

పిల్లలూ మమ్మల్ని క్షమించకండి
మీలోంచి దయా, తృప్తీ, రసమూ వడకట్టి
ఘనపదార్థంగా తీర్చిదిద్దినందుకు కృతజ్ఞతగా

మీరు డబ్బు యంత్రాలు కండి
బహుళజాతి విపణివీధుల బానిసలై తరించండి
కాఠిన్యం నిండిన కోర్కెలతో కాలం గడపండి
మమ్మల్ని వృద్ధాశ్రమాలకి కానుక చేసి వదిలించుకోండి

*13.6.2014 మధ్యాహ్నం 12.19*
*బ్లాగ్: 17.7.2014*

# ఈ శీతాకాలపు ఉదయం

ఈ శీతాకాలపు ఉదయం. రాత్రంతా మంచుముక్కలా బిగుసుకొన్న ఆకాశంలో కదల్లేని నక్షత్రాలు వెండితెరల కాంతిలోంచి జారుకొంటూ గడ్డిపరకలపై కన్నుతెరిచాయి. ఇక చాలనుకొంటూ కాంతిబాజా మ్రోగిస్తూ కనిపించనిచోటికి నిన్ను పిలుస్తూ మాయమయ్యాయి. ఈ ఉదయం తొడుక్కొన్న చలివస్త్రంలోంచి చెట్లు చల్లని పచ్చసిరాతో జీవితం కాగితమ్మీద కొత్తసంతకాలు చేస్తున్నాయి. మనుషులు సరే. ఎప్పట్లానే ప్రాణాన్ని పట్టుకోమంటే దేహాన్ని తాకుతూ, ఇంత బంగారుకాంతికీ రవంతైనా కరగని ఇనుపస్పందనలతో, మోసపోయామని తుప్పుపట్టిన పాటనే మ్రోగిస్తుంటారు. నువ్వూ అంతే. ఓ గాలితెర అన్నీ వదలి రమ్మన్నా వినకుండా, భాష వృధా అనుకొంటూనే, దానికి తొడిగిన లిపిని విప్పుతూ, మడతలు పెడుతూ నీదికాని ఆట మళ్ళీ మొదలుపెడతావు.

మళ్ళీ ఒక విరామం. దాన్లోకి బట్టల్లేకుండా దూకాలని తెలిసికూడా, జ్ఞానంతో మసకబారిన కళ్ళనైనా తుడుచుకోకుండా మునుగుతావు. రంగుల్లేని విరామం నీ రంగుల్ని ఒప్పుకోదు. నిన్ను ఒప్పుకోని విరామాన్ని నువ్వూ ఒప్పుకోవు. నీకింకా చాత కాలేదు, నదిలోకి నీ నీడని విడిచి దూకటమెలానో. మరోసారెప్పుడైనా ప్రయత్నించు నీడలేకుండా నడవటానికి. నువ్వు బాధకాదు, నీ నీడ బాధ. నీకు తెలియకపోయినా పోయేదిలేదు. నీ నీడకి తెలిసీ ఉపయోగం లేదు.

తెలీదు. మళ్ళీ విరామమో, కాదో. ఇప్పటికి చాలు. అలా వీధిలోకి వెళ్ళి, తెల్లని ఎండలో సంచరించే రంగురంగుల చీకట్ల ధూళి చల్లుకురావాలి. మరి బ్రతకాలి అందర్లో ఒకడిలా. అందర్లానే అయిష్టంగానో, ఇష్టంగానో అర్థంకాకుండానే.

ఏ దైవమో విడిచిన బాణంలా ముందుకు దూసుకుపోతుంది కాలం. ముందు వెనుకలుగా మార్చుకొంటున్న వాక్యాల్లోంచి కూడా కాలం ముందుకు వెళ్ళిపోతుంది. చూసినవేవీ గుర్తుండవు. గుర్తుండేలా చూడాల్సినవీ లేవు. స్మృతి కన్నా మరపు సుఖం. రాసిన రాతల కన్నా వాటి వెనుకనున్న తెల్లకాగితం ఎక్కువ చెబుతుంది. చూసినవి మరిచిపోవద్దు, చూసేవాడిని మర్చిపోతే చాలు. పదాల నెందుకూ, వాటిలో నింపిన అర్థాల నెందుకూ, మరిచిపోతే చాలు మాట్లాడేవాడిని.

ఆకాశపు నగారా అదేపనిగా మ్రోగిస్తో చెబుతోంది జీవితం. నీ అంతట నువ్వు బ్రతకనపుడు, బ్రతుకు నిన్ను బ్రతికించుకొంటుంది. ఎందుకూ బ్రతకాలనుకోవటం, చావాలనుకోవటం. పుట్టి, పోవుటలు నాటకము, నట్టనడిమి ఈ చూపొక్కటి నిజము. ఇటునించి అటు వెళ్ళినపుడు అశ్వత్థవృక్షం అర్థమవుతుంది.

మరి వెళ్ళిరానా అన్నావు ఆరోజు. ఆ మాట కోసమే ఎదురుచూస్తుందన్న నిజాన్ని మర్యాదగా బయటికి రానివ్వకుండా, సరే మరి అంది. భూమ్మీద వేల జీర్ణపత్రాలు రాల్చినవాడివి, సరే లోలోపల అప్పటికే మూసుకొన్న తలుపుల్ని గుర్తుపట్టి కూడా ఏమీ తెలియనంత ప్రశాంతంగా బయటికి నడిచావు. నీడల లిపి తెలుసు గనుక ప్రేమ నుండి లభించిన స్వేచ్ఛని ఇట్టే పోల్చుకొన్నావు. ఇంటి క్రీనీడలో ఆమె నీడ చిక్కగా కరిగిపోయింది. ఆమె హృదయంలోంచి బయటకు వచ్చాక ఆకాశం మరింత నిర్మలంగా కనిపించింది.

ఇంత దు:ఖం ఎలా మోయనంటావు బరువు కనబడనీయని తేలికైన మాటల్లోకి తడుముకొంటూ. మోసేవాణ్ణి దించేస్తే, జీవితం మోసుకొంటుంది, నీకేం పని అని ఆ జెన్ సాధువు. అతను లేకపోతే నా జీవితం బోసిపోతుంది మరి అంటావు. అదీ సంగతి అని నవ్వుతూ నువ్వొదలని మాటల్నీ, నీడల్నీ నీకు విడిచి నిర్లక్ష్యాన్ని భుజాని కెత్తుకొని నీటిమీద నడుస్తూ వెళ్ళిపోతాడు. బరువుగా ఉండటమే బ్రతకటమని నమ్ముతాం గనుక, తేలికైన జీవితం తెలియకుండానే వ్రేళ్ళ సందుల్లోంచి జారిపోతుంది.

...

కాలం మరికొంత వెన్నలానో, వెన్నెల్లానో కరిగాక నువ్వూ, నేనూ, నిందలూ ఎవరిదారిన వాళ్ళం వెళ్ళిపోదాం. కాలం లేనిచోట నిలిచే విద్య తెలియలేదు గనుక, మరోసారెప్పుడైనా మళ్ళీ కలుద్దాం కొత్త పాతమొహాలతో. అప్పటి శీతాకాలపు ఉదయంలోంచి కూడా దేవుడేం చెప్పేదీ వినబడకుండా శబ్దాలతో మనని వెచ్చగా కప్పుకొందాం, అచ్చం ఇలానే. ఇంతకు ముందులానే.

*రచనాకాలం : 9.1.2015 ఉదయం 12.30*

*ప్రచురణ : వాకిలి.కాం ఫిబ్రవరి 2015*

*బ్లాగ్ : 9.2.2015*

# కవి నేపథ్యం

*జయంతి త్రైమాసిక సాహిత్య పత్రిక, హైదరాబాద్, జనవరి-మార్చి 2012 సంచికలో చీకోలు సుందరయ్యగారితో పంచుకొన్న అభిప్రాయాలు, మరికొంత విశదంగా..*

**మీకు కవిత్వం రాయాలని ఎందుకనిపించింది?**

ప్రతి మనిషికీ తాను బ్రతకాలనే జీవితేచ్ఛ ఎట్లా బలీయంగా ఉంటుందో, అట్లాగే తనను తాను వ్యక్తీకరించుకోవాలనే కాంక్ష కూడా ఉంటుందనుకొంటాను. మానసిక చైతన్యం సాధారణస్థాయి కంటే అధికంగా ఉన్నవారిలో కొందరు - తమ కార్యక్షేత్రంగా నిత్య వ్యవహారాలతో సరిపెట్టుకోలేక, తమ వ్యక్తీకరణకూ, నిత్యవ్యవహారాలకూ పొసగక - ఒక స్వప్న ప్రపంచాన్ని ఎన్నుకొంటారు. ఆ ప్రపంచంనుండే అన్ని కళారూపాలూ ఉద్భవిస్తాయి. నా బాల్యంలో నేను రంగులలో నా ప్రపంచాన్ని వెదుక్కొనేవాడిని. యవ్వనకాలంలో రంగుల స్థానంలోకి అక్షరాలు ప్రవేశించాయి. అప్పటినుండీ నా అక్షరాలలో, నేను నా ఆంతరిక ప్రపంచాన్నీ, నన్నూ వ్యక్తీకరించుకోవటం మొదలైంది.

**మీ స్వప్న ప్రపంచంపై సాహిత్య ప్రభావం ఎలా ఉంది?**

ప్రతివారి స్వప్న ప్రపంచం వారి జీవశక్తిని అనుసరించి, అంతంతమాత్రంగానో, బలీయంగానో ఉంటుంది. ఊహ తెలిసేనాటికి, అది తనకూ అర్థంకాని, ఘనీభవించిన రూపంలో ఉంటుంది. అది ఒకలాంటి అవ్యక్తస్థితిలో ఉన్నప్పటికీ, దాని భారం అతని అనుభవంలో ఉండి, కుదురుగా నిలబడనీయకుండా చేస్తుంది. నేను ఇలా ఎందుకున్నాను, జీవితమంటే ఏమిటి, ప్రపంచమంటే ఏమిటి, జీవితానుభవం ఇంత సంక్లిష్టంగా, దు:ఖమయంగా ఎందుకుంది వంటి ప్రశ్నల రూపంలో అతనిలోని జీవశక్తి అతన్ని సదా వెంటాడుతుంది. ఆ ప్రశ్నలకి జవాబులు వెదుక్కొనే క్రమంలోనే కొందరు సాహిత్యం చదువుకొంటారు. పూర్వమానవుల అనుభవాలూ, వేదనలూ, అన్వేషణా, అవగాహనా - మనల్ని మనం త్వరగా, స్పష్టంగా అర్థం చేసుకొనేందుకు దోహదపడతాయి.

అలాంటి వ్యక్తావ్యక్త ప్రశ్నలతోనే, వ్యక్తావ్యక్త స్వప్నాలతోనే నన్ను నేను తెలుసుకొనేందుకు సాహిత్యం చదువుకొన్నాను. అట్లా చదువుకొన్న సాహిత్యం నా స్వప్నలోకాన్ని వికసింపచేసిందనీ, పరిపుష్టం చేసిందనీ, నన్నూ, నా చుట్టూ ఉన్న మానవ సమాజాన్ని సరిగా అర్థం చేసుకొనేందుకు, సమాజం పట్ల సరైన స్పందనలతో జీవించేందుకు దోహదం చేసిందనీ అనుకొంటాను.

**మిమ్మల్ని ప్రభావితం చేసిన రచయితలెవరు?**

జ్ఞాపకం ఉన్నంత వరకూ శరత్‌బాబు, ప్రేమ్‌చంద్, రాహుల్‌సాంకృత్యాయన్, విశ్వనాధ సత్యనారాయణ, గోపీచంద్, బుచ్చిబాబు, తాపీ ధర్మారావు, వడ్డెర చండీదాస్, టాల్‌స్టాయ్, విక్టర్ హ్యూగో మొదలైన - జీవితం పట్ల తమదైన దారిలో స్పష్టమైన నిబద్ధత, జీవితానుభవం పట్ల అసాధారణ శ్రద్ధా, సార్వజనీనతా గలవారి - రచనలు, ముఖ్యంగా కథా, వ్యాస సాహిత్యం నన్ను ఎక్కువగా ప్రభావితం చేసాయి.

యవ్వనకాలంలో శ్రీశ్రీ రచనలూ, శ్రీశ్రీ ప్రభావంతో చదివిన సామ్యవాద సాహిత్యమూ  సామ్యవాద దృక్పథం పట్ల ఆసక్తి కలిగించినా, కొన్ని సంవత్సరాలకే, మానవజాతి దు:ఖవిముక్తికి అది సమగ్ర పరిష్కారం కాదనిపించింది. సామూహిక మానవ స్వప్నంలో - సమసమాజ భావన ఉదాత్తమమైనదనే గౌరవం ఉన్నా, దానిని సాధించటం వెలుపలి నుండి కాకుండా - మానవులు వారి మానసిక పరిపక్వత, పరిణతుల ద్వారా - కాలక్రమంలో సాధించుకోవలసిన సహజ పరిణామమని అనిపిస్తుంది.

తరువాతి కాలంలో చలం ప్రభావం గాఢంగా ఉంది. అందుకు - ప్రతివాక్యాన్నీ, తన హృదయంనుండి సూటిగా అవతలి హృదయానికి చేరవేసే ఆయన శైలి ఒక కారణమైతే, ఆ వాక్యాలలో కనిపించే నిర్భీతీ, నిజాయితీ, స్పష్టతా, ఆయన రచనలంతటా పరుచుకొన్న రసాత్మక జీవితం పట్ల ఎడతెగని దాహం, అంతంలేని సత్యాన్వేషణా, స్వేచ్ఛా చింతనా ఇతర ముఖ్యమైన కారణాలు. ఆయన రచనలలో స్త్రీ, పురుష సాంగత్యమే జీవన సాఫల్యమైనట్లుండటాన్ని అంగీకరించలేకపోయినా - దానితో సరిపెట్టుకోలేని బలీయమైన సత్యాన్వేషణను గమనించినపుడు - ఆయనకు నమస్కరించాలనిపిస్తుంది. చలం పట్ల గౌరవానికి మరి రెండు ముఖ్య కారణాలు - ఆయన ద్వారానే టాగోర్ కవిత్వాన్ని చదువుకోవటం, ఆయన ద్వారానే శ్రీ రమణమహర్షిని తెలుసుకోవటం.

తరువాత నా ఆలోచనా విధానాన్ని ప్రభావితం చేసిన వారిలో సంజీవదేవ్ ముఖ్యులు. ఆలోచించటంలో, ఆలోచనని వ్యక్తీకరించటంలో ఆయన చూపే సంయమనం, అతిసూక్ష్మమైన పరిశీలనా విధానం తప్పనిసరిగా నేర్చుకోవలసినవనిపిస్తుంది. నేను చదివినంతలో ఆ లక్షణాలు, గురజాడ తరువాత ఆయనలోనే చూసాను.

**మీ కవిత్వరచనపై తొలి ప్రభావాలెవరివి**

తొలిరోజుల్లో శ్రీశ్రీ ప్రభావం వుంది. దృక్పథం మారిన తరువాత - నా తొలి కవితాసంపుటి ఆరాధన రాసినపుడు - నాపైన టాగోర్ ప్రభావం గాఢంగా ఉంది. ఆ సంపుటి చదివిన మిత్రులు కొందరు "గీతాంజలి చదువుతున్నట్లుంది" అనేవారు. ఇది స్థాయి గురించిన మాట కాదు, గీతాంజలిలోని వాతావరణమే ఆరాధనలో కనిపిస్తుందని.

**మీకు హైకూలు రాయాలని ఎందుకనిపించింది?**

**86** ప్రాంతాలలో ఆరాధన కవిత్వం రాసినపుడు - దానిలోని మొదటి కవిత - "సామ్రాజ్యాలను జయించినా, కీర్తి విస్తరిల్లినా - చిరుగాలికి ఊగే పచ్చగడ్డిమీది నుండి జారిపడే - మంచుబిందువుని చూసి - మౌనంలో పడకపోతే - జీవితపు విలువలు తెలియవు" అని వుంటుంది. నాకు స్పష్టంగా తెలియకుండానే - ఒక స్వచ్ఛమైన దృశ్యం గాఢమైన మౌనానుభవాన్నిస్తుంది - అనే భావం నాలో ఉంది. అంతే కాకుండా, "చెప్పేదేదో స్పష్టంగా, సూటిగా చెప్పి - ఇంత మౌనానికీ, ధ్యానానికీ, కార్యాలకీ, విజయాలకీ వ్యవధినివ్వరాదా"అన్న చలం కోరిక కూడా నాలోపల సదా పనిచేస్తూ ఉంటుంది. ఈ నేపథ్యంలో సంజీవదేవ్ వ్యాసాలలో హైకూని గురించి చదివినపుడు, ఈ ప్రక్రియ నాకు తగినదిగా అనిపించి హైకూలు రాయటం ప్రారంభించాను.

**మీ హైకూ పరిణామక్రమం చెప్పండి**

తొలి హైకూలు, అప్పటికి వ్యక్తిగతంగా కూడా పరిచయం వున్న ఇస్మాయిల్‌గారికి చూపించినపుడు, నిజానికి అంత బాగోకపోయినా ఆయన బావున్నాయనటం, తరువాతికాలంలో ఇస్మాయిల్‌గారి హైకూలు పత్రికలలో రావటం, అవి తెలుగు సాహిత్య ప్రపంచాన్ని ఆకర్షించటం జరిగాయి. అట్లా హైకూలకు కావలసిన భూమిక ఏర్పడటంతో, విస్తృతంగా హైకూలు రాయటం, పత్రికలకు పంపించటం

జరిగింది. తరువాత వాటిని 'దృశ్యాదృశ్యం' పేరుతో సంపుటిగా తీసుకువచ్చినపుడు - బివివి ప్రసాద్ అనే కవి తెలుగు సాహిత్యలోకానికి పరిచయమయ్యాడు.

ఆ హైకూలు చదివి నాసరరెడ్డి "ఆలంకారికత భారతీయకవులకి సమస్య. అలంకారాలు లేకపోతే హైకూ బాగుంటుం''దనటం, హైకూని గురించి పునరాలోచింపచేసింది. అపుడు కంజిర కవిత్వపత్రిక ప్రచురించిన నాసరరెడ్డి అనువదించిన జపనీయ హైకూలనీ, ఇతరత్రా కొన్ని ఆంగ్లానువాదంలో లభ్యమైన హైకూలనీ చదివినపుడు, ఇంత సరళంగా, సూటిగా, నిరలంకారంగా ధ్యానానుభవాన్ని కలిగించవచ్చుకదా అనుకొంటూ, ఆ ప్రయత్నంలో భాగంగా రాసిన హైకూలతో 'హైకూ' సంపుటిని రాయటం, తరువాత స్పష్టమైన అవగాహనతో 'పూలు రాలాయి' హైకూ సంపుటిని రాయటం జరిగాయి.

'పూలు రాలాయి' హైకూ సంపుటిలో, హైకూ పితామహునిగా భావించే బషో హైకూని ఎలా భావించాడో, అలాగే రాయగలిగానని నమ్ముతున్నాను. దృశ్యాదృశ్యం, హైకూ సంపుటాలలో కూడా ధ్యానానుభవాన్ని ఇవ్వటానికి ప్రయత్నించినా, స్వచ్ఛమైన హైకూ అభివ్యక్తి పూలురాలాయి నాటికి నాకు అలవడిందనుకొంటాను.

**హైకూలు రాయటం ఎందుకు ఆపేసారు?**

దీనికి ముఖ్యమైన కారణాలు మూడు. ఒకటి. నేను వ్యక్తీకరించాలనుకొన్న భావాలకు, ఇవ్వదలచిన కవిత్వానుభవానికి అన్నిసార్లూ హైకూ అనే కాన్వాస్ తగినది కాకపోవటం. ఒక విస్తృత అనుభవాన్నీ, ఒక ఆలోచనా ప్రవాహాన్నీ హైకూ ఆద్యంతం అందించటానికి తగినది కాదు. నిజానికి హైకూ అనుభవం కవితో పాటు, పాఠకుని మనఃపరిపక్వత మీద, సంసిద్ధత మీద ఆధారపడివుంటుంది. వచనకవిత్వంలో కవికి వాతావరణాన్ని సృష్టించే వీలు కొంతవరకూ ఉంటుంది. అలాగే, ఒక ఆలోచనను మొదటినుండీ నడిపించే వీలుంటుంది.

రెండవది. హైకూ కేవలం ప్రకృతిని మాత్రమే వస్తువుగా కలిగి వుంటుంది. సమాజ విషయాలనూ, మానసిక సంక్లిష్టతనూ హైకూ వంటి ఉదాత్త ప్రక్రియ ఆవాహన చేయలేదు. అందువలన సంక్లిష్ట మానవ మానసిక ప్రపంచాన్ని ఆవిష్కరించటం హైకూలో సాధ్యం కాదు.

మూడు. సగటు తెలుగు పాఠకులూ, కవులూ హైకూ అనుభవాన్ని

అందుకోగలిగిన అనుభవసాంద్రతా, లోతైన ఆలోచనాశక్తీ ఉన్నవారు కాదు. ఈ స్థితివలన, వారు హైకూ స్థాయికి ఎదగటానికి బదులు, హైకూని తమస్థాయికి అవనతం చేస్తారు. అనాదరణ ఏ కళాకారుడినైనా నిరుత్సాహపరుస్తుంది.

**మరలా వచనకవిత్వం రాస్తున్నపుడు మీపై ఎవరి ప్రభావాలైనా ఉన్నాయా?**

మరలా వచనకవిత్వం రాస్తున్నపుడు, హైకూల ద్వారా ఏ ధ్యానానుభవాన్ని, ప్రగాఢమైన నిశ్శబ్దాన్ని, నిర్మల హృదయస్పందననీ ఇవ్వటానికి ప్రయత్నించానో, దానినే వచనకవిత్వంలో కూడా వ్యక్తీకరించాలనుకొన్నాను. హైకూలకు భిన్నంగా, కొంత భూమికనీ, కొంత వాతావరణాన్నీ సృష్టించటం వచనకవిత్వంలో సాధ్యమౌతుంది గనుక, అలాంటి వాతావరణాన్ని ఆవిష్కరించటానికి ప్రయత్నించాను. అభివ్యక్తిలో హైకూలో ఉండే సరళతనీ, అవసరమనిపిస్తే తప్ప నిరలంకారంగా రాయటాన్నీ ప్రయత్నించాను.

నా అభివ్యక్తిపైన, సరళమైన పదాలతోనే గాఢానుభవాన్ని కలిగించే ఇస్మాయిల్‌గారి ప్రభావం ఉందనుకొంటాను. ముఖ్యంగా, కవులు సాధారణంగా పాటించే రొమాంటిక్ టోన్‌ని, అంటే, ఒక ఉద్వేగాన్నో, వస్తువునో పట్టుకొని అదే జీవితమైనట్లు వ్యక్తీకరించటం విడిచిపెట్టి, ప్రశాంతస్వరంతో మాట్లాడటంపై ఇస్మాయిల్‌గారి ప్రభావం ఉంది. అగాధమైన ఆలోచననీ, భావగాంభీర్యాన్నీ నింపుకొన్న అతి సహజమైన, ప్రశాంతవాక్యం ఆయన కవిత్వంలో చూసాను.

అలాగే శివారెడ్డిగారూ, ఈ కాలం కవులలో కొందరూ, ఒక దృశ్యాన్ని లేదా మానసికచలనాన్ని ఎంత మృదువుగా, చైతన్యస్పృహతో తాకుతున్నారో గమనించాను. బహుశా మన కవిత్వ వాతావరణంలోని సారమే నా కవిత్వ వ్యక్తీకరణలో వుందనుకొంటాను. అయితే నా కవిత్వంద్వారా వ్యక్తీకరించిన భావాలపై ఎవరి ప్రభావమూ లేదు. టాగోర్, ఖలీల్‌జిబ్రాన్‌ల ప్రభావం కొంతవరకూ ఉంటుంది. అయితే ఈ సాంద్రమైన భావాలకు మూలాలు ఎక్కడ ఉన్నాయంటే, నేను చదువుకొన్న తత్వచింతనలో ఉన్నాయనుకొంటాను.

**ఎవరెవరి తత్వచింతన ప్రభావం ఉంది?**

శ్రీ రమణమహర్షి, శ్రీ నిసర్గదత్త మహరాజ్‌ల ప్రభావం ఎక్కువగా ఉంది. జీవితానికి సంబంధించిన అనేక మౌలికప్రశ్నలకు, తర్కబద్ధమైన సమాధానాలను వారినుండి గ్రహించాను. తరువాత ప్రాచీనకాలంనాటి స్వరూపవర్ణన చేసే శాస్త్రాలూ

(అష్టావక్రగీత, అవధూతగీత, ఋభుగీత, త్రిపురారహస్యం ఇత్యాదులు), శ్రీ శంకరుల సాహిత్యం, ఓషో, జిడ్డు కృష్ణమూర్తి వంటి ఆధునిక తాత్వికుల చింతనా, నాకు అందినంత వరకూ చదువుకొన్నాను. ఆయా పుస్తకాలు చదువుకొన్నాను అనటం కన్నా, వాటిలోని కొన్ని భావాలనైనా భావించగలిగాను, ధ్యానించగలిగాను అనటం సరైనదనుకొంటాను.

వాటితోపాటు అపుడపుడూ భిన్న దేశాల, మతాలకు చెందిన జ్ఞానుల, అన్వేషకుల మాటలు ఎక్కడైనా చదివినపుడు, వీరందరూ ఒకటే సత్యం చెబుతున్నారు కదా అనిపించేది. దక్షిణ అమెరికాలోని రెడ్ ఇండియన్ జాతికి చెందిన డాన్ జువాన్, యూరపులోని సోక్రటీస్, గుర్జిఫ్, పశ్చిమాసియా ప్రాంతపు జీసస్, సూఫీలు, భారతీయ రుషులు, తూర్పు ఆసియా ధ్యాన బౌద్ధులు.. అందరూ ఒకే సత్యమనే సూర్యుడినే వేరువేరుకాలాల్లో ధ్యానించినట్లూ, కీర్తించినట్లూ గమనించి ఆశ్చర్యమూ, సంతోషమూ కలిగేవి. జ్ఞానాన్వేషణకీ, మతానికీ తప్పనిసరిగా ఆలోచనాపరులందరూ గమనించాల్సిన భేదం ఉందనిపించేది.

ముఖ్యంగా కొత్త తరాన్ని ఓషోని అధ్యయనం చెయ్యమని చెప్పాలనిపిస్తుంది. ఆయన సత్యాన్వేషణ (స్పిరిట్యుయాలిటీ)కీ, కేవల తత్త్వచింతన (ఫిలాసఫీ)కీ, మతాని (రెలిజియన్)కీ నడుమ ఉన్న సరిహద్దుల్ని స్పష్టంగా గుర్తించి, ప్రపంచమంతటా ఉన్న సత్యాన్వేషణను సహజ సుందరమైన శైలిలో పరిచయం చేసారు. అయితే తగినంత సూక్ష్మబుద్ధి లేకపోతే, ఆయన బోధనలను దురాన్వయం చేసుకొనే అవకాశం ఉంది. ఇది నిజానికి, సత్యానేషణతోనూ, లోతైన ప్రతివిషయంతోనూ ఎప్పుడూ ఉండే సమస్య.

**అయితే మీ తత్వచింతన ప్రభావం మీ కవిత్వంపైన ఉండివుంటుంది.**

అవును. అయితే ఇలా రాసినవారు నేను మాత్రమే కాకుండా, మన ప్రాచీనులలో పోతన, వేమన, కబీరు వంటివారు, ఇతర దేశాలలో కొందరు కవులు ఇలాగే కవిత్వం రాసినట్టు కనిపిస్తుంది. అయితే ఖలీల్ జిబ్రాన్ మినహా, ఏ విదేశీ కవినీ నేను చదవలేదు. ఇలాంటివారిని మనం మార్మిక కవులు (మిస్టిక్ పొయెట్స్)గా భావిస్తాం. కొందరు భక్తి కవిత్వాన్ని మార్మిక కవిత్వంగా భావిస్తారు కాని, నిజానికి సత్యాన్వేషణా పూర్ణమైనదే మార్మిక కవిత్వమనీ, అటువంటి సత్యానేషణతో నిండిన భక్తి కవిత్వం మాత్రమే మార్మిక కవిత్వంగా భావించవలసి ఉంటుందనీ నాకు అనిపిస్తుంది.

**ఇప్పుడున్న వాదాల పట్ల మీ అవగాహన ఏమిటి?**

ఇప్పుడున్న సామాజిక, రాజకీయ వాదాల పట్ల నా అవగాహన అంతంత మాత్రమే. లోతుకంటా తెలుసుకొనే శక్తీ, ఆసక్తీ లేనపుడు తటస్తంగా ఉండటమే సరైనదనుకొంటాను.

ఈ సమస్యలు తాత్కాలికమనీ, ఒక మనిషి లోలోపలి అస్తిత్వవేదనకు ఇవి పైపై వ్యక్తీకరణలనీ అనిపిస్తుంది. మనిషి తనలోనికి చూడకుండా, ఎదగకుండా ఉన్నంతకాలం, సమస్యలు ఒకరూపంలో పరిష్కారమైతే, మరొకరూపంలో తలెత్తుతూనే ఉంటాయి. సమసమాజం కూడా ఒకనాటికి మానవజాతి మానసిక పరిణతి ద్వారా మాత్రమే సిద్ధిస్తుందనుకొంటాను. అయితే సామాజిక, రాజకీయ పరిణామాలు ఒక విస్తృతమైన క్రమంలో సంభవిస్తూనేవుంటాయి. మానవజాతి సుదీర్ఘప్రస్థానంలో అకస్మాత్తుగా ఏ స్థిరమైన, చివరిమార్పూ సంభవించదు. అలా సంభవించినట్లు కనిపించినా, అది కనిపించటమే కాని, లోపలి వాస్తవాలు భిన్నంగా వుంటాయి. అవి మరింత మేలైన పరిణామానికి దారితీస్తూనే వుంటాయి.

**కొన్ని మౌలికమైన వాదాలు ఎప్పుడూ ఉంటాయి కదా?**

కొన్ని మౌలికవాదాలలో నా అభిమాన విషయాలు ఇలా ఉన్నాయి. వ్యక్తి, రాజకీయ సంస్కరణలలో వ్యక్తిసంస్కరణవాదం, బుద్ధి, హృదయవాదాలలో హృదయవాదం, భౌతిక, అధిభౌతికవాదాలలో అధిభౌతికవాదం నా అభిమాన విషయాలు. సాహిత్యంలో రస, ప్రయోజనవాదాలలో రసవాదం ఇష్టం. అయితే రసావిష్కరణ సమాజహితం కోరే దిశగా జరగాలే కాని, సమాజానికి హానిచేసే ప్రేరణలను కలిగించకూడదని నమ్ముతాను.

అట్లాగే స్త్రీ, పురుషవాదాలలో స్త్రీవాదం ఇష్టమైనది. అయితే, ఇది స్త్రీ పురుషునితో సమానం కావాలనే స్త్రీవాదం కాదు, పురుషుడు స్త్రీతో సమానం కావాలనే స్త్రీవాదం. అంటే, దయ, ఓర్పు, క్షమ వంటి మానవవిలువలు స్త్రీ సహజమైన గుణాలు అనుకొంటే, అలాంటి గుణాలను పురుషులు కూడా అనుసరించాలని.

**మీరు అభిమానించే వాదాలే సరైనవని భావిస్తున్నారా?**

నేను అభిమానించే వాదాలకు రెండవవైపున ఉన్నవి వ్యతిరేకమైనవి కావని, ప్రతి రెండు విరుద్ధశక్తులూ, పరస్పర శత్రువులు కావనీ, పరస్పర పూరకాలనీ, ఒకదాని

మనుగడ, పరిణతీ, వికాసం రెండవదానిపైన ఆధారపడి ఉన్నాయనీ భావిస్తాను. విరుద్ధశక్తుల సమన్వయం పట్ల తీవ్రమైన శ్రద్ధగలవారు జీవితం లోతుల్నీ, విస్తృతమైన జీవితానుభవాన్నీ అందుకోగలుగుతారనీ అనుకొంటాను.

విరుద్ధశక్తుల యుద్ధక్షేత్రంలో ఎటూ ఒరిగిపోకుండా తనను తాను వెదుకుకొంటూ నిలబడినవాడు అగాధమైన జీవనభూమికలలోకి మేలుకొంటాడనీ, అతను తన మానవజాతి పట్లా, సమస్తజీవితం పట్లా నిష్కపటమైన ప్రేమను ప్రకటించగలుగుతాడనీ అనిపిస్తుంది. అటువంటి అగాధమైన ప్రేమను ప్రకటించటమే కవుల, కళాకారుల బాధ్యత అనీ, ఆ బాధ్యత మనం సవ్యంగా నిర్వర్తించగలిగితే, అది మొత్తం మానవజాతిని ప్రభావితం చేస్తుందని, కాలాంతరంలో మరింత మేలైన మానవసమాజం నిర్మించబడటానికి ఒక కవీ, కళాకారుడూ తనవంతు 'అశ్రువొక్కటి ధారపోసిన'ట్లవుతుందనీ నమ్ముతున్నాను.

**ఇవాళ్టి సమాజంలోని సమస్యలకు కారణాలేమనుకొంటున్నారు?**

మానవాళి ప్రోగుచేసి ఉంచుకొన్న అసమానతలూ, అర్థంలేని గర్వాలతోపాటు, ఇవాళ్టి జీవనవిధానం కూడా. ఇవాళ్టి సగటు మానవునికి జీవితం పట్ల శ్రద్ధలేదు, చిత్తశుద్ధి తక్కువ.

సమాజానికి మార్గనిర్దేశం చేయవలసిన తాత్వికులూ, మేధావులూ, కవులూ, కళాకారులూ, నాయకులూ, వినోద, ప్రసార మాధ్యమాలూ, అందరికీ స్వీయగౌరవమూ, స్వప్రయోజనమే పరమావధిగా ఉంది. వాటి నిమిత్తం వారుకూడా మానవవిలువల్నీ, సత్యనిష్ఠనూ ఉపేక్షిస్తున్నట్లు కనిపిస్తుంది. వారే సరిగా లేకపోతే, స్వంతంగా బలమైన ఆలోచనలేని, ప్రభావాలలో పడి కొట్టుకుపోయే సగటు మనుషుల సంగతి చెప్పేదేముంది. అంతగా తెలివి వికసించనివారిని ఆకర్షించటం కోసం, తెలివైనవారూ అవివేకంగా ప్రవర్తించటం ఇవాళ్టి విషాద జీవనశైలికి ఒక ముఖ్య కారణమనిపిస్తుంది.

మరొకటి. సాంకేతికంగా వస్తున్న వేగవంతమైన పరిణామాలను, మానవ హృదయం అందుకోలేకపోవటం. అందువలన వినియోగ సంస్కృతి పెరిగి, హృదయం మరింత మూసుకుపోతోంది.

**మరి ఈ వ్యవస్థను మార్చటమెలా?**

వ్యవస్థను మార్చదలచినప్పుడు, అది పిల్లల విద్యావిధానం దగ్గర

మొదలుకావాలి. పిల్లలకు మానవవిలువలతో నిండిన జీవితం పట్ల సమగ్రమైన, శాస్త్రీయమైన అవగాహన చిన్ననాడే కలిగించాలి, అందరూ సమానమనే స్పృహ అప్పుడే రావాలి. జీవితమంటే వస్తువినియోగం కాదనీ, జీవితం లోతుల్లో, మనిషి మాత్రమే గ్రహించగలిగిన, గ్రహించవలసిన సత్యమూ, సౌందర్యమూ ఉన్నాయనే ఎరుక కలగాలి.

అటువంటి విద్యావ్యవస్థలో తయారైన తరం అసమానతల నుండీ, హింస నుండీ మానవజాతిని సహజంగా, శాశ్వతంగా విముక్తి చెయ్యగలుగుతుంది. కానీ, సమాజ పరిణతికి విద్య చాలా ముఖ్యమైన భూమిక వహిస్తుందనే అవగాహనే ఇంకా మన ఆలోచపరులు చాలామందికి రాలేదు. అందువలనే ఉన్న మానవవిలువలు కూడా లుప్తమైపోతున్న సాంకేతికవిద్యల పట్ల మనకు మోజు పెరుగుతుంది.

యుక్త వయసు దాటిన వాళ్ళు బలవంతంగానో, మరేవిధంగానో తయారుచేసే వ్యవస్థలు కొంత ప్రయోజనం కలిగించినా, కొత్త సమస్యలను మోసుకువస్తాయి. ఇవి వ్యాధి మూలాన్ని వదిలి పైపైన మందు వెయ్యటం లాంటివి అనిపిస్తుంది. మితిలేని స్వార్థమూ, గర్వమూ కలిగివుండటం తెలివితక్కువతనం, హీనం అనే జ్ఞానం పెరగాలి. అటువంటి వివేకం వలన మాత్రమే శాశ్వత పరిష్కారాలు లభిస్తాయి కాని, ఉద్వేగాలవల్ల కాదు.

మానవ విలువలు పాటించటం కేవలం పాతకాలం నీతికాదనీ, సమగ్రమైన జీవితానుభావానికీ, ప్రశాంతమైన సామాజిక జీవనానికీ ఆ విలువలు వైజ్ఞానిక సూత్రాలనీ మనకి అర్థం కావాలి.

**మానవ విలువలంటే?**

దయ, ఓర్పు, నిజాయితీ, శ్రద్ధ, వినమ్రత, క్షమ, స్నేహం, పంచుకోవటం వంటివి. ఇవి ఏ ఒక్క ప్రాంతానికో, జాతికో, మతానికో, సిద్ధాంతానికో సంబంధించినవి కాదు. సమస్త మానవాళి హృదయ స్పందనకు చెందినవి.

**మీ హైకూ సంపుటాల తరువాత చాలాకాలం ఏమీ రాసినట్లులేరు, తరువాత అకస్మాత్తుగా ఆకాశం సంపుటి ప్రకటించారు, ఇలా ఎందుకు జరిగింది?**

హైకూలు రాసే సమయంలోనే, వచన కవిత్వాన్నీ సాధన చేస్తూ వచ్చాను. అట్లా రాసినవన్నీ కలిపి, 2006లో 'నేనే ఈ క్షణం' ప్రచురించినా, వాటిలో ఎక్కువ భాగం 2000కు ముందు రాసినవే. అలాగే 2011లో వచ్చిన ఆకాశంలోనూ 2010కి

ముందు రాసినవి ఆరు మాత్రమే. వ్యక్తిగత జీవితంలోని ఒడిదుడుకులూ, కవిత్వమెవరికి కావాలన్న అనాసక్తీ, కవిత్వానుభవాన్ని మించిన జీవితానుభవం కోసం వెదుకులాటా - ముఖ్యంగా ఈ మూడింటి వలనా ఒక దశాబ్దకాలం కవిత్వానికి దూరంగానే ఉన్నాను.

ఒడిదుడుకుల నుండి తేరుకొన్న తరువాత, కవిత్వం రాసే, చదివే కొద్దిమంది మిత్రులూ కలిసినప్పుడల్లా మీరు కవిత్వం రాయాలనటం, ముఖ్యంగా శివారెడ్డిగారి వంటి కవి ఇంత ప్రతికూల పరిస్థితులలోనూ, ప్రతి ఒకటిరెండు సంవత్సరాలకూ కవిత్వసంపుటాలు ప్రకటించటం, ఎక్కడన్నా కలిస్తే నువ్వు రాయవేమిటని ప్రశ్నించటం, శ్రద్ధగా తన సంపుటాలు పంపించటం, స్థానిక మిత్రులు కొప్పర్తిగారు వత్తిడి చేయటం - వీటన్నిటితో మరలా రాయాలనిపించింది.

సుమారు 3,4 కవితలు రాసిన తరువాత, ఇన్ని సంవత్సరాలుగా నిద్రాణంగా ఉన్న శక్తి ఏదో మేలుకొన్నట్లయి, సుమారు 3,4 నెలల కాలం పూర్తిగా నన్ను వశపరచుకొన్నట్లనిపించింది. ఒకేరోజు 3,4 కవితలు కూడా వచ్చేవి. వందకుపైగా రాసాక, వచ్చినవే పునరుక్తి అవుతున్నాయనిపించటంతో నెమ్మదిగా ఆ అభివ్యక్తి ఆగిపోయింది. అయితే, ఇట్లా ఒకేసారి రాయటం అనేది, హైకూ సంపుటాలు వేసినపుడు కూడా జరిగేది. 50, 60 హైకూలు ఉండగా సంపుటి వేద్దామనుకొంటే ఒకటి, రెండు నెలల్లోనే మరొక వంద హైకూలు వచ్చేవి.

**ఆకాశం కవిత్వం మీరు అంతకుముందు రాసిన కవిత్వం కంటే ప్రత్యేకంగా ఉన్నట్లుంది, ఇది ఎలా జరిగింది?**

ఆకాశం కవిత్వంలోని అభివ్యక్తికీ, భావాలకీ (ఫారం, కంటెంట్) సంబంధించిన భూమిక ఇంతకుముందు మాట్లాడుకున్నాం. అయితే ఆకాశం కవిత్వం రాస్తున్నపుడు, నాకు నేను కొన్ని నియమాలు పెట్టుకొన్నాను.

పాఠకుడికి మరింత తేలికగా అందాలి. మొదలుపెడితే చాలు, చివరివరకూ చదివించటానికి తగిన వేగం ఉండాలి. ఏ భావాలు చెప్పినా, ఎప్పుడూ ఉండే సున్నితత్వంతో పాటు, ప్రగాఢమైన దయ అంతర్లీనంగా ఉండాలి. తాత్వికానుభవాన్ని మరింత స్పష్టంగా అందించాలి. కవిత్వం పూర్తిగా గొంతువిప్పి మాట్లాడుతున్నట్లుండాలి.. ఇలాగ. నేను పెట్టుకొన్న నియమాలన్నిటినీ చాలా వరకూ పాటించగలిగాననే సంతృప్తి కలిగింది.

**ప్రతిస్పందన ఎలా ఉంది?**

పుస్తకం అచ్చయి మిత్రులకు చేరిన తరువాత, రెండు, మూడు రోజులకి ఒక మిత్రుడు ఫోన్ చేసి "ఆకాశం చదువుతుంటే నాలోపలి గందరగోళం, చిక్కుముడులూ, భ్రమలూ అన్నీ విడిపోతున్నాయి. ఎందుకో ఆగకుండా కన్నీళ్ళు వస్తున్నాయి'' అన్నాడు. అయితే పుస్తకం నేను ఆశించిన గమ్యం చేరింది అనుకొన్నాను. తరువాత కూడా ఒక్కొక్కరుగా చాలామంది ఇలాగే హృదయంలోంచి కదిలి మాట్లాడారు. చిత్రమేమిటంటే, మేధావులు, సీరియస్ పాఠకులు అయినా, కాకపోయినా ఇంకా లోపల ఏమాత్రమో సరళత్వం, సజీవహృదయ స్పందనలు ఉన్న ప్రతివారిని ఇవి కదిలించటం.

నేను గమనించినది ఏమిటంటే, కవిని తెలుసుకొనేందుకో, కవిత్వాన్ని తూకం వేసేందుకో కాకుండా, కేవలం తమను తాము వెదుక్కొనేందుకు ఆకాశం చదువుతున్న ప్రతి ఒక్కరూ, ఈ పుస్తకాన్ని హృదయానికి హత్తుకొంటున్నారు. ఇన్నాళ్ళ నా కవిత్వ ప్రయాణం ఒక ముఖ్యమైన మజిలీ చేరిందనుకొంటున్నాను.

j j j

# బివివి ప్రసాద్ కవిత్వం గురించి
## ఉత్తరాల నుండి

మీరు దయతో పంపిన "ఆరాధన" అందింది. రెండుమూడుసార్లు చదివి ఆనందించాను. మీ కవితా ప్రతిభ సహజము, విశిష్టము. పట్టుపురుగులోంచి పట్టు వచ్చినట్లు మీలోనుంచి కవిత్వం నిర్గతమవుతోంది. వాల్మీకి "ఆ పుష్పాన్ని చూడు. నీ శోకం పోతుంది" అని కబంధుడి చేత రాముడికి చెప్పిస్తాడు. .. అలాగే మీ కావ్యపంక్తులు అత్యంత ఆహ్లాదకారులు. ''నన్ను తాకిన వానచినుకు ఆకాశంలో మెరిసే ఇంద్రధనుస్సును చూడమని చెప్పింది'' జీవితం మీచేత నిరంతర కవిత్వ రచన చేయించే కృప కలిగి  ఉండాలని ఆశిస్తూ -

***శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ**, హైదరాబాద్, 14.4.91*

మీరు ఆప్యాయంగా పంపిన "ఆరాధన" అందింది. మీ రచనా ప్రవృత్తి లోనే తాత్వికరేఖలున్నాయి. అందుకు తగిన శీర్షికే పుస్తకానికి పెట్టారు. సంతోషం.

***డా. సి.నారాయణరెడ్డి**, హైదరాబాద్, 7.7.90*

మీరు ప్రేమతో పంపిన మీ ''ఆరాధన'' అందుకొని, చదువుకొని ఆనందించాను. .. మీ కవితలను గురించి ఏమని రాయాలో తెలియని కోమాలో పడ్డాను, వాటిని చదివిన తరువాత. కారణం, మీవి మాటలతో వ్రాయబడినప్పటికీ అవి మాటలను దాటి  వెళ్ళిపోయినాయి. సంవేదనా జగత్తును వదిలి శుద్ధవేదనా జగత్తుకు. మాటల అందుబాటులో ఉంటే తాము మైలపడతామని వాటి భయం. ..

***డా. సంజీవదేవ్** , తుమ్మపూడి, 16.3.91*

మీరు దయతో పంపిన పుస్తకం అందింది. "నన్ను నేను వెతుక్కునే ప్రయత్నమే ఇందులో ఉంద''న్నారు. నిజంగా అంతే. కవి తన్ను తాను వెతుక్కునే ప్రయత్నంలోనే కవిత్వం పుడుతుంది. అందుకనే నిజమైన, స్వచ్ఛమైన కవిత్వం రాయగలిగారు. ప్రభావాల గురించీ, తోటివాళ్ళ గురించీ, ఉద్యమాల గురించీ పట్టించుకోకండి. మీ ధోరణిలో మీరు ఆత్మావిష్కరణ చేసుకోండి. మీ కవిత్వం నాకు నచ్చింది.

***శ్రీ ఇస్మాయిల్** , కాకినాడ, 4.4.91*

మీ "ఆరాధన" - నాకు సంతోషం కలిగినప్పుడు / దానిని పంచుకోగలవారి కోసం / వెర్రిగా చుట్టూ చూశాను / చిరునవ్వుతో నీవు కనిపించావు / నా సంతోషం మాయమైంది. నాకు దుఃఖం వచ్చినపుడు / దానిని పంచటం కోసం / ఆశగా వెదికాను / చిరునవ్వుతో నీవు కనిపించావు / నా దుఃఖం మాయమైంది - అంటూ సాగిన మీ కవిత్వం తాత్వికంగానూ, హృద్యంగానూ వుంది. శుభాకాంక్షలు.

***శ్రీ వడ్డెర చండీదాస్,*** *తిరుపతి, 14.10.92*

మీ ఆరాధన చదివాను. .. పుస్తకం మొదలుపెట్టినపుడు టాగోర్ ధోరణిలో వుందనిపించింది. టాగోర్, చలంల ప్రభావం మీమీద బాగా వుందనిపించింది. అనుకరణ, అనుసరణలు మాత్రం కాదు. ఆ ధోరణి అన్నమాటను పూర్తిగా అనుకూలార్థంలో, మంచి అర్థంలో వాడాను.

ఐతే మృత్యువు గురించిన మీ ఆలోచనలు కొత్తగా, హాయిగా వున్నాయి. చావంటే భయం, దిగులు, బాధ బీభత్సం వంటి అనుభూతులే సాధారణంగా కలుగుతాయి. .. .. కానీ మరణాన్ని ప్రకృతిలో ఐక్యమవటంగా గుర్తించి దాన్ని గురించి సున్నితంగా, సంతోషంగా, ఆనందంగా ఆలోచించినవారు నాకు తెలిసిన పరిమిత కవిలోకంలో లేరు.. నయం - నేను మరణించక ముందే మీ కవిత్వం చదివాను. ఆశతో, ఆనందంతో, ఈ లోకంలో నాకు దొరకని ప్రకృతిలోకి ప్రయాణమనే అద్భుతస్వప్నంతో మరణానికి చేతులు చాచగల ధైర్యం వచ్చింది.

ఇంత చిన్న వయసులో, మొదటి పుస్తకంలో మృత్యువు నెలా యెంచుకున్నారా అని ఆశ్చర్యపోతున్నాను. .. .. మీరు "ఆరాధన" పంపి మంచిపని చేశారు. నేను బాధలో వున్నవారికి వుపశాంతి కలిగించే కవితావీవనను అందించగలుగుతాను. ఆ విశ్వాసం ఒక మనిషిలో కలిగించటం కంటే కవితా ప్రయోజనం యేముందంటారు?

***శ్రీమతి ఓల్గా ,*** *సికింద్రాబాద్, 1.2.2000*

"నేనే ఈ క్షణం" అందింది. కవిత్వం విలక్షణం గా, అంతర్ముఖంగా జీవకళతో ప్రకాశిస్తున్నది. అరుణశైలశిఖరం నుంచి ఒక బాలకిరణం హృదయంలోనికి చొరబడినట్లుగా ఉన్నది. "పగటి దుఃఖాల పైకి / రాత్రి దయగా అవతరించినట్లు / నువ్వు నాలోపల మృదువుగా అవతరిస్తావు".. "సంతోషం ఎప్పటికీ రహస్యమే".. .. "సత్యం నుంచి వైఫల్యమే జీవితం, ప్రపంచం, పాలపుంతలు" ఇలా ఎన్నైనా

ధ్యానించదగిన పంక్తులే ఎక్కువగా పరచుకొని ఉన్నాయి ఈ పుస్తకంలో. నాకు మీరు కవిత్వం ద్వారా బాగా నచ్చారు. అభినందనలతో

***డా. కోవెల సుప్రసన్నాచార్య**, వరంగల్, సెప్టెంబర్ 2006*

తణుకు నించి ఈరోజు మధ్యాహ్నం కాకినాడ చేరాను. తణుకులో మనందరం కలవటం, గోష్ఠి చెయ్యడం బాగుంది. ..“నేనే ఈ క్షణం” కవితాసంపుటి బస్సులోనే చదివాను. ప్రాకృతిక సౌందర్యం, జీవనతత్త్వం పెనవేసుకుని అద్భుతమైన భావచిత్రాలుగా ఆవిష్కరింపబడతై. నాటినమబ్బు, నదీ ఒడ్డూ, తూనీగా, ఒక సౌందర్యం ఒక విధ్వంసం, కల ఒక నిజం... ఎన్నో ఎన్నో- అందరికంటే విభిన్నమైన పరిష్కారాలివ్వడం, ఆలోచనలోనే వినూత్నత ఉండడం మీ శైలికి బలం. మీదైన చిక్కదనం మీ కవితల నిండా ఉంటుంది. తాత్విక ఆలోచనల నిబద్ధత, గొప్ప భావుకత - మీలో అడుగడుగునా కనిపిస్తుంది. ఒక కవి మొత్తం ఆలోచనా చైతన్యంలో, ఆవిష్కరణ సౌందర్యంలో, అభివ్యక్తి శిల్పంలో ఒక నిబద్ధత కనిపించడం అరుదుగా ఉంటుంది. అది మీలో ఉంది. సామాజిక నిబద్ధత గాని, మరే నిబద్ధత గాని కవిని ప్రత్యేకం చేస్తుంది. .. మీ కవితలన్నీ నాకు గొప్ప అనుభూతినిచ్చినై. (రెండో మూడో కావాలని రాసినట్లున్నై) పాపాయి గురించి రాసినవి మరీమరీ స్పందింపజేసినై. రవీంద్రుని తర్వాత ఇలాటి కవితాత్మకత మీరు చూపినట్లనిపించింది. కొద్దిగా అతని ప్రభావం ఏదైనా మీమీద ఉండవచ్చు, లేకపోవచ్చు. అభినందిస్తూ శుభాకాంక్షలతో

***డా. అద్దేపల్లి రామమోహనరావు,** కాకినాడ, 18.8.06*

“నేనే ఈ క్షణం” కవితాసంపుటి అందింది, కవితలన్నీ చదివినాక, అవును మీరే ఈ క్షణం అన్నట్టుగా వున్నాయి. “ఇరుతీరాల నడుమ” “ఒక సౌందర్యం ఒక విధ్వంసం“, ఇంకా ఎన్నో కవితల్లో పాపాయి ప్రసక్తి హాయిగా వున్నాయి. మీది సున్నితమైన సంస్కారం. సూక్ష్మమైన తన్మయం. కవితాశక్తి వుంటే చిన్నకవితలైనా, పెద్దకవితలైనా పండించొచ్చు. మీరిన్నాళ్ళు పెద్ద కవితలు ఎక్కువగా రాయకపోవడం ఒక లోటే అని మీ కవితలు చదివితే అనిపించింది. మీ కవితల్లోని భావుకతకు నమస్కరిస్తూ

***డా. ఎన్. గోపి,** హైదరాబాద్, 25.8.06*

మీరు ఆగస్టులో పంపిన “నేనే ఈ క్షణం” సంపుటి చదివాను. ఊహలను

వహించే మనస్సు, వానాకాలపు పచ్చని మొక్కలాగా, ఎప్పుడూ కవిత్వాన్ని పుష్పిస్తూనే వుంటుంది. మీ కవిత్వం ఇంతకు ముందునించే నాకిష్టం. రెండుమాటలు - పాపాయితో దేవుడు - ఇరుతీరాల నడుమ - నదిని చూసి - కల వెలుపలి కల - మరొక మెలకువ కోసం-వేసవి వర్షాన్ని-ఇస్మాయిల్ గారికి అనేవి నాకు మరీ బాగున్నాయి. శుభాకాంక్షలతో

***శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ ,** హైదరాబాద్, 16.10.06*

"నేనే ఈ క్షణం" చదివాను. ఈ పాపాకాశంలో నేనొక నెల'వంక'నయ్యాను. ఆకాశం పాప హృదయంలో వెన్నెల గుండెగా మారాను. పాప అమాయకత్వం నాకెప్పటికీ రాదు. నేనెప్పుడైనా సూక్ష్మ, రహస్యలోకాలకు వెళితే ఆ క్షణాలను అక్షరీకరిస్తాను. అంతవరకు మీ పుస్తకం ఊయలలో పాపాయిలా ఉంటాను.

***డా. ఎండ్లూరి సుధాకర్ ,** రాజమండ్రి, 19.8.06*

మీరు ప్రేమతో పంపిన "నేనే ఈ క్షణం" మీ కవిత్వం అందినది. కృతజ్ఞతలు. మీరుంచిన శీర్షిక భావుకతతో ఉంది. మీ కవితల్లో ఆర్ద్రత ఉంది. సౌందర్యం ఉంది. కొన్ని పదబంధాలు నన్ను కట్టేసినవి. "నాకు అనుభవమంటే / చలనాల నుండి నిశ్చలంలోకీ / శబ్దాలనుండి నిశ్శబ్దంలోకీ కరిగిపోవటం" బాగుంది.

**డా. టి. శ్రీరంగస్వామి,** హసన్‌పర్తి, 23.8.06

మీరు అభిమానంతో పంపిన కవిత్వం పుస్తకం"నేనే ఈ క్షణం" అందుకున్నాను. అందుకున్న క్షణంలోనే అక్షరాల బారుల వెంట "ఒక కొత్త ఆకాశం" "ఆనందం"గా "అంకురం" వేసింది. .. "ఏ కారణమూ, ఏ ఉద్వేగమూ శాశ్వతంగా ఆదుకోవు / దొరికిన శబ్దాలు పట్టుకుని ఎటో ఈదుతుంటాం" అని మీరన్న మాట కటిక వాస్తవం. సంకలనంలో "పాప" గురించి వైవిధ్యభరితమైన కవితలు బాగా సంతరించారు. ..

***శ్రీ సుధామ,** హైదరాబాద్, 25.9.06*

మీ వచనకవిత్వ కావ్యం - నేనే ఈ క్షణం - అందుకొన్నాను. ధన్యవాదాలు. మంచి కవిత్వ లక్షణాలను గురుదేవులు రవీంద్రులు నిర్వచించారు. "క్లుప్తత - గుప్తత - ఆప్తత" అని. ఇవన్నీ మీ కవితల్లో నిరాడంబరంగా వున్నాయి. చదివితే ఆనందం కలుగుతుంది.

***శ్రీ మునిపల్లె రాజు,** సికింద్రాబాద్, 15.9.08*

హృదయంలో ముంచి తీసినట్లున్నారు మీ కలాన్ని! అనుభూతులు తప్ప సిరా మరకలెక్కడా లేవు. అచ్చమైన తెల్లకాగితంపై మరింత తెల్లని అనుభూతు లెన్నియలు! బాగుంది మీ "నేనే ఈ క్షణం" కవిత. మనిషిని మరో ప్రపంచపు టంచుల దాకా తీసుకెళ్ల గలదు! ..

*శ్రీ గన్ను కృష్ణమూర్తి,* కామారెడ్డి, *16.9.08*

"నేనే ఈ క్షణం" అందింది. నీ కవిత్వం, నీ కవిత్వంలోని అంతరాంతరాల సంగీతం, నీ కవిత్వాల, సంగీతాల వెనక కదలాడే పాకృతిక చిత్రాలూ, ఆ చిత్రాలలో ప్రవహించే జీవననాదాలూ నాకిష్టం. ఎప్పుడన్నా, వీలయినప్పుడు ఓ లేఖరాయి. ఇక్కడి కొచ్చినప్పుడు కలిస్తే, అదీ మరింత సంతోషమే.

*శ్రీ నగ్నముని, హైదరాబాద్, 20.9.08*

"నేనే ఈ క్షణం" పద్యాలు చాలా బాగున్నయ్. కాసేపు దూరంనించి కాసేపు దగ్గర్నించి పలికే ఆత్మీయ స్వరంలా. మీరు నాకేమో అవుతారు అమ్మో నాన్నో పాపాయో అన్నట్లుగా. ఒక్కచూపులో తెలిసిపోయిందని కాదు, తెలుసుకోవాలనిపించింది. మీరూ, నేనూ వేరుకాదని, వేరనీ అనిపించింది. అద్దంలో చూసుకున్నట్లనిపించింది కుడి ఎడమలు తారుమారయ్. (నో పొలిటికల్ ఫన్ ఇంటెంటెడ్). ఇంకా ఇంకా చదవాలనిపించింది, ఇంకా ఇంకా పుస్తకం పంపినందుకు చాల కృతజ్ఞతలు.

*శ్రీ హెచ్చార్కె, హైదరాబాద్, 22.9.08*

జ్వరపడిన మనసుకి కవిత్వం వైద్యం చెయ్యటం ఎలాగో ఆకాశం చేసి చూపిస్తుంది. జీవించటం ఎలా.. సాటి మనిషిని నమ్మటం ఎలా.. అని వెల్లువెత్తే సంఘర్షణకి మంచిమందు ఆకాశం. సాటి మనిషి దగ్గర ఒక నిజమైన మనిషిలా నిలబడటానికీ, జీవితాన్ని ఒక కళలా జీవించటానికీ స్ఫూర్తి నిస్తుంది.

*శ్రీ శ్రీకాంత్ అడ్డాల, హైదరాబాద్, 23.6.15*

ఆకాశం కొలవడం అసాధ్యం. చదవడం సాధ్యమే కానీ చాలాకాలం పడుతుంది. అందుకే ఇంతకాలం పట్టింది. నేను ఏ పుస్తకం చదివినా నచ్చిన వాక్యాలకు టిక్ గుర్తు పెట్టుకుంటూ ఉంటాను. మొత్తం కవిత అంతా ప్రత్యక్షరం బాగా నచ్చితే దాని శీర్షికకే టిక్ గుర్తు పెట్టేస్తాను. అలాంటివి ఆకాశంలో చాలా నక్షత్రాలున్నాయి. ఇంటిబెంగ, అంతరాత్మవంటివాడు, చాలు, మనలో ఒకడు, సంపాదన, కలుసుకోవాలి,

చివరచూసినవాడు, గోడ, మొదటిప్రశ్న, నేను ఉన్నాను, సున్నితంగా, కవిత్వం, చివరిమాటలా, పంజరాలు, కవీ-మేఘమూ, బ్రతుకుపాట, బహిరంతరాలు - ఇవన్నీ అంతబాగా నచ్చేసినవే. "చాలు" అనే కవిత అయితే దానికే విసుగొచ్చేన్నిసార్లు చదువుకొన్నాను. "మనం చిన్నచిన్న ఆకాశాల" మనడంలో జీవ లక్షణం బాగా చెప్పారు. ఆకాశంలోకి చూడటమంటే అమ్మ ముఖంలోకి చూడటమనే అభివ్యక్తి చాలాబాగుంది. "ఇంటిబెంగ"లో "జీవ బ్రహ్మణోర్భేద:" అనే తత్త్వం సున్నితంగా వ్యక్తమయింది. అలలులేని కొలనే పాలసముద్రం. ఆలోచనలే అలలు. పాలసముద్రంలో విష్ణువు ఉంటాడంటే అర్థం ఆలోచనల్లేకపోవడమే దైవదర్శనం అని. ఈ తత్త్వం అంతా "కొలను" లో సూక్ష్మంలో మోక్షంలా చెప్పారు. .. ... లోకానికి గెలుపుజ్వరం తగిలిందనడం పచ్చినిజానికి పండిన అభివ్యక్తి. .. "అలవాటు మహామాయ" అనడం గాఢతాత్త్వికభావన. .."మనలో ఒకడు" అసూయకు మంచిమందు. స్త్రీ పురుషాకర్షణ పెళ్ళికి ముందు పూవు తుమ్మెదలాంటిదై, పెళ్ళయ్యాక దీపం శలభం లాంటిది కావడం చూస్తూనే ఉన్నాం. మరింత పేరు, మరింత డబ్బూ ఉంటే జీవనానందం సమాధి అయిపోయినట్లేనని అద్భుతంగా చెప్పారు. "మనల్ని మనమే శ్రద్ధగా జాగ్రత్తగా బంధించుకుంటాం" అనేమాట భాగవతంలోని "త్యజేత కోశస్కృది వేహమాన: కర్మాణి లోభాదవి తృప్తకామ:" అనే వ్యాసవాక్యాన్ని గుర్తుచేసింది. "వస్తాము" అనే ఖండికలో జన్మ ఎత్తడంలో ఉండే తత్త్వమంతా ఉంది. "కలుసుకోవాలి" అనే కవిత ప్రపంచానికి మార్గదర్శి. "చివరచూసినవాడు" కవిత మనిషిలోని అపరిపూర్ణతను ఆవిష్కరించింది. .."ప్రపంచం ఒక గోడ" అనే 3 పంక్తుల్ని ఇప్పటికే మూడు నాలుగు సభల్లోనూ, టీవీలోను మీ పేరు చెప్పి మరీ చెప్పాను. నేనెవరు అని ప్రశ్నించుకోడానికి అంతా విరామసమయమే అయిపోతే ఎంతబాగుండును! "నేనున్నాను" కవిత దానికదే ఒక ఉపనిషత్తు. మొత్తం మీద మీ "ఆకాశం" లో "ఉన్నదంతా దైవమే. జీవితమే దైవం." ఎంతరాస్తే న్యాయం జరుగుతుంది. దాచుకొని మళ్ళీమళ్ళీ చదువుకోవలసిన కవితాసంపుటి అందించారు. ఆజన్మాంతం కృతజ్ఞుణ్ణి.

***డా. గరికిపాటి నరసింహారావు,*** హైదరాబాద్, *17.10.14*

# సమీక్షలనుండి

హైకూలు రాసి గొప్ప గుర్తింపు పొందడానికి ముందు ప్రసాద్ గొప్ప కవిత్వం రాసాడు. దాన్ని "ఆరాధన" పేరుతో ప్రచురించాడు. తాత్విక సాంద్రతగల కవిత్వం చెప్పగల శక్తివంతుడు ప్రసాద్ ఇలా అంటాడు. గానం గానంగా దివ్యమైంది కాదు / మౌనం గానాన్ని తన దివ్యత్వాన్ని వ్యక్తం చెయ్యడానికి ఉపయోగిస్తుంది. .. నా మటుకు నాకు ప్రసాద్ భవిష్యత్తుపై మంచి ఆశలున్నాయి. నాలాగే ఎందరికో!

***డా. నాగభైరవ కోటేశ్వరరావు,** యువసంతకాలు, **వార్త దినపత్రిక, 8.11.98***

మీరు ఏదైనా కుటీరంలోకో, పర్ణశాలలోకో వెళ్ళేటప్పుడు మీ మనసు ఎలా ఉండాలి. ఈ పుస్తకం మొదలుపెట్టేటపుడు కూడా అలా ఉండాలి. పర్ణశాల నుండి బయటికొచ్చాక మీ మనసు ఎలా ఉంటుంది? దీనిలోని కొద్ది కవితలు చదివిన తరువాత కూడా అలా ఉంటుందని నేను హామీ ఇస్తున్నాను. ఈ పుస్తకంలోని ప్రతి అక్షరం ఒక పర్ణశాల. అది మౌనాన్ని నేర్పుతుంది. ధ్యానం అనుభూతినిస్తుంది. పర్ణశాలలోని సాత్విక ఆనందాన్ని కూడా ఇస్తుంది. ..

***శ్రీ వసీరా** "నేనే ఈ క్షణం" పై సమీక్ష నుండి **ఆంధ్రప్రభ దినపత్రిక 4.12.06***

మరల మరల చదవాలనిపించే కవిత్వమిది. మనిషి సుఖదు:ఖాలను, విషాదానందాలను తాత్వికంగా పరికించి వ్యాఖ్యానించే తాత్వికునిలా కనిపిస్తాడీ కవి. ఇతని కవిత్వంలో రమణమహర్షి, జిడ్డు కృష్ణమూర్తి, రస్సెల్ వంటి తాత్వికుల ఛాయ సూపర్ ఇంపోజ్ చేసినట్టుగా కనిపిస్తుంది.. ఇతని కవిత్వం చదవటం ఒక పురానుభవం.

***శ్రీమతి వసంత** "నేనే ఈ క్షణం" పై సమీక్ష నుండి **వార్త దినపత్రిక 12.11.06***

సృష్ట్యాది నించే మనిషి ఏదో కోల్పోయాడు. దైవానికి దూరమయ్యాడు. సహజత్వాన్ని కోల్పోయాడు. ఆ సంగతిని ప్రసాద్ అపూర్వంగా ఆవిష్కరిస్తాడు. మనిషిని చూసి మనం జాలిపడేలా చేస్తాడు. అభివ్యక్తిలో ఆయన భావాలు ఎక్కడా ఉద్రేకపడవు. ఏదో సౌందర్యస్పృహ ఆయన అక్షరాల్ని ఆల్లుకుని ఒక నిర్మలత్వాన్ని ఆపాదించినట్లు అనిపిస్తుంది. చెప్పదలుచుకున్నది కవిత్వపు సరిహద్దులకు లొంగే వుంటుంది. ..

***శ్రీ సౌభాగ్య,** ఈకాలం కవులు, **ఆంధ్రభూమి దినపత్రిక, 2.10.06***

దీన్ని చదువుతున్నంతసేపూ మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. ఈ కవిత్వంలోని పదాలంత మృదువుగా, పోలికలంత లలితంగా, భావనలంత నిర్మలంగా ఉంటుంది. "ఎడతెగని ప్రార్థన లాంటి ఆర్ద్రతలోకి సమస్తాన్నీ అనువదిస్తున్నట్లుంటుంది" ఈ కవిత్వపు అవసరం ఉన్నట్టు తడుతుంది. ద్వితీయ ప్రపంచంలో, అంటే తన సృష్టిలోనే ఇరుక్కుపోయి ఊపిరాడక అవస్థ పడుతున్న మనిషికి విముక్తి చూపాల్సిన అవసరం కనబడుతుంది. ధ్యానం గుర్తుకొస్తుంది. మనిషికి, బాహ్య ప్రపంచాన్ని మాత్రమే తెలుసుకొని సుఖశాంతులతో ఉండలేడు కనక, ధ్యానావసరం కలిగింది. అంతఃప్రపంచం ఒకటి ఉందని తెలియాలి, అది ఎలాంటిదో తెలియాలి. అప్పుడు బాహ్య ప్రపంచాన్ని ఎలా సమీపించాలో, ఏంచేసినా ఎలా చెయ్యాలో తెలుస్తుంది. .. కొన్ని కవితల్లో జెన్ ఛాయలు కనిపిస్తాయి. హైకూ మీదుగా వస్తున్న ఈ కవి ప్రయాణాన్ని గుర్తు చేస్తాయి. .. ఇటువంటి కవితలు చదువుతున్నపుడు సూఫీ కవిత్వం గుర్తుకొస్తుంది. కానీ సూఫీ ఫిలాసఫీకి పరిమితమైన సంపుటికాదు ఆకాశం. .. ఈ ఆకాశపు కవితా వాక్యం, దాని తర్వాత వాక్యం. మొత్తంగా ఈ కవితాసంపుటి ప్రాఫెట్ తర్వాత పుస్తకం. తిలక్ గురించి రాసిన ఒక కవితలో నేను మీ తర్వాత తరం వాడిని అన్నారు ప్రసాద్. అక్కడ అనాల్సిన మాట "నేను జీబ్రాన్ తర్వాత తరం వాడిని" అని నాకనిపిస్తుంది. ఈ ఆకాశం ఆంగ్లంలోకి అనువాదం కావాలని నా ఆకాంక్ష. భారతదేశపు జీబ్రాన్ ఇలా ఉంటాడని ప్రపంచానికి తెలియాలి ..

**డా. రెంటాల శ్రీ వేంకటేశ్వరరావు** *"ఆకాశం" పై సమీక్ష నుండి.*

***చినుకు సాహిత్య మాసపత్రిక జూన్ 2012***

ఆకాశమంటే అంతు దొరకని రహస్యం, ఏదీ దాచిపెట్టలేని బహిరంగం కూడా. ఒక్క బివివి ప్రసాద్‌కే కాదు, మనక్కూడా. కానీ మనకంత తీరికేది. చూపేది. ప్రసాద్‌కున్న పరిశీలనేది. మనమంతా ప్రవాహం. ప్రసాద్ గట్టుమీదున్న చెట్టు. గట్టు మీద నిలబడి ఎలాంటి గర్వం లేకుండా జీవితాకాశాన్ని అక్షరాల తీగలు పేర్చుకొని కవిత్వం రాగాలు తీస్తాడు. .. నూరు కవితలున్న ఆకాశం చదివాక నూటొక్కటో కవిత ఎందుకులేదన్న బాధ. ప్రసాద్ ఆరవ పుస్తకం ఎప్పుడొస్తుందన్న డిమాండ్, ఆశ. అడుగడుగునా కవి గురించీ, ఆకాశం గురించీ చెప్పినట్లు నడిచే ప్రసాద్ కవిత్వంలో అబ్బురపరచని వాక్యమేదైనా దొరుకుతుందేమోనని చూసాను. సరళవాక్యం సరమెక్కడైనా తెగిపోకపోతుందా అని చూసాను. ఓడిపోవడం పాఠకుడిగా మొదటిసారి గర్వించాను...

ప్రసాద్ రాసిన ప్రతి కవితా వాక్యమూ మెరుపుల మాలికలాగా ఉండటం ఆశ్చర్యానందాలతో ముంచెత్తుతుంది పాఠకుల్ని.

***శ్రీ ఏనుగు నరసింహారెడ్డి*** *"ఆకాశం"* పై సమీక్ష నుండి ***వార్త దినపత్రిక 9.10.11***

శక్తికి మించిన లక్ష్యాలు, పరుగుపందాలుగా మారిన ఎడారి జీవితాల్లో గుర్రప్పందాలు కాసేపైనా మర్చిపోయి, ఇలా సేదతీరమని చెప్పే కవిత్వం ఈ రోజు మనకు చాలా అవసరం. లోలోపలి సామర్థ్యాన్ని మరొక్కసారి తరచి చూసుకోవటానికి, కనీసం వెళ్తున్న దారి మనమెంచుకున్న గమ్యాలకు చేరవేస్తుందో లేదో చూసుకోవడానికైనా మనిషికి విశ్రాంతి అవసరం. మనసుకు సాంత్వన అవసరం. బ్రతకాలన్న కాంక్ష అన్నింటికన్నా బలంగా అవసరం. .. సంఘంలోని ఆలోచనాపరులను ఆత్మావలోకనం చేసుకునే దిశగా అడుగులు వేయించగలిగితే, అంతకు మించి కవిత్వం సాధించగల పరమార్థం వేరొకటి ఉంటుందనుకోను. "ఆకాశం" ఈతరం తప్పక చదవాల్సిన కవిత్వం. పదిమంది చేత చదివించబడవలసిన సున్నితమైన, సమున్నతమైన కవిత్వం.

***శ్రీమతి మానస చామర్తి,*** *మధుమానసం.ఇన్ 11.9.12*

కవి అయినా, కళాకారుడైనా తన టార్గెట్ ఆడియన్స్ ని నిరంతరం అబ్బురపరుస్తూనే ఉండాలి. పాఠకుడి స్థాయి పెరిగేకొద్దీ తాను ఒక మెట్టు పైనే ఉన్నానని నిరూపించుకుంటూ ఉండాలి. .. నేను కవిత్వాన్ని ఆస్వాదించగలననీ, కేవలం చదవడానికే చదివి అనుభూతిని అరువు తెచ్చుకునే రకం కాదనీ నాకు చాలాసార్లు నిరూపణ అయింది. అయినా కృష్ణశాస్త్రి, కరుణశ్రీ, చలం, శ్రీశ్రీ, తిలక్‌లతో ఆగిపోవడానికి ప్రధానకారణం పైన చెప్పినదే. నేను చదివిన ఒకటీ అరా ఆధునిక కవితలు నా పాండిత్యాన్ని పరీక్షించకపోగా, సదరు "కవుల" మానసిక పరిణతి మీద ప్రశ్నలు రేకెత్తించాయి. This so-called 'Modern poetry' is not so 'modern' in thoughts and definitley not my cup of coffee అనుకుని వదిలేశాను. అయితే ఒకటీ అరా సర్వం కాదనీ, కవిత్వపు గుబాళింపులు 'గతజన్మలోని జాజిపూల సువాసన' కాదని 'ఆకాశం' గుర్తుచేసింది. ఆధునిక కవిత్వ ధోరణి పట్ల నా అభిప్రాయం మార్చుకోవాలేమో అని ఆలోచింపజేసింది.

***శ్రీ చాణక్య,*** *పుస్తకం. నెట్ **21.11.12***

ప్రతి మనిషీ తన మాయాలోకాన్ని దాటి దైవత్వం చేరే అవకాశం కల్పిస్తుంది. గాయాల్ని మాన్పలేని జీవితాన్ని కౌగలించుకోవడం మనమూ నేర్చుకుంటాం. ఈ పుస్తకం నిండా స్నేహితలా పలుకరించి చల్లబరిచే చరణాలే .. మనలో మనకు నచ్చిన మనిషిని చూపించే కారణాలే. ప్రతి అక్షరం దయకురిపిస్తూ జీవనభయానికి దూరంగా మనల్ని జరుపుతున్నట్లు.. మనలో మేలుకొన్నట్లు కలగంటాం. .. మనలో మనం మేలుకొనే మాటలు చదువుతున్నప్పుడు ఈ ఒక్క పుస్తకమే జీవిత సారమనిపిస్తుంది.

***శ్రీ యశశ్వి సతీష్,*** *బ్లాగు.కాం/సతీష్ 19.10.12*

## చివరిమాట

బివివి ప్రసాద్ అనే కవి కవిత్వం గురించి తెలియనివాళ్ళకి పరిచయం చేయటానికి బావుంటాయని పాత ఉత్తరాలూ, సమీక్షలూ ముందు వేసుకొని తిరగేస్తుంటే, సుమారు పాతికేళ్ళ సాహిత్య ప్రయాణంలో మాట్లాడిన, కలిసిన, ప్రేమించిన మిత్రులెందరో కళ్ళముందు కనిపించటం మొదలుపెట్టారు. తొలి కవిత్వగురువులు శ్రీ జీయస్వీ నరసింహారావుగారు, శ్రీ చెరువు సత్యనారాయణశాస్త్రి గారుల నుండి ఈనాటి కవిసంగమం, ఫేస్‌బుక్ మిత్రుల వరకూ, పుస్తకాల పరిచయసభల్లో, పురస్కారసభల్లో, వివిధ సాహిత్యసందర్భాలలో, కలిసినప్పుడూ, పరోక్షంలోనూ ఎందరో ఈ కవి కవిత్వాన్ని స్మరించారు, ప్రేమించారు. వారిలో చాలామంది ఈ కవిని కూడా కవిత్వాన్ని తాకినంత మృదువుగా తాకారు.

పరిచయానికి అయిదారుగురి మాటలు తీసుకొన్నా సరిపోతుంది అనుకొన్నదల్లా, ఈ నెపంతోనైనా మిత్రులందర్నీ తలచుకొన్నట్టు ఉంటుందని ఇలా పొడిగించాల్సి వచ్చింది. అయినా అసంతృప్తి అలానే వుంది. ఈ హైకూలని, ఈ కవిత్వాన్ని ఎంతో ప్రేమించిన ఎవరెవరి పేర్లు రాలేదా అని చూస్తే, చాలామందే కనిపిస్తున్నారు. పేర్లు మాత్రమే రాసుకొంటూ వెళ్ళినా ఎందరివో రాయాలి. అయినా ఏ ముఖ్యమైన వ్యక్తులు సమయానికి గుర్తురారోనని భయం. ఇన్ని మానవసంబంధాలతో ఈ జీవితాన్ని సంపద్వంతం చేసినందుకు కవిత్వానికి, ఆ కవితాంశ ప్రసాదించి నందుకు జీవితానికి నమస్కరిస్తూ, ఈ కవి కవిత్వాన్ని ప్రేమించినవారికీ, ఇతని పట్ల దయగా వుండే కుటుంబానికీ, బంధువులకీ, మిత్రులకీ అందరికీ హృదయపూర్వకమైన ధన్యవాదాలు తెలియచేస్తున్నాను.

***బివివి ప్రసాద్,*** *తణుకు, 22.6.2015*

## బయోడేటా

| | |
|---|---|
| పూర్తిపేరు | : బొల్లిన వీర వెంకట ప్రసాద్ |
| పుట్టినతేదీ | : **21. 11. 1966** |
| పితామహులు | : బొల్లిన వీరన్న, సత్యనారాయణమ్మ-ముక్కామల, ప.గో.జిల్లా |
| మాతామహులు | : భోగవల్లి సుబ్బారావు, సూర్యకాంతం-సూర్యారావుపాలెం, ప.గో.జిల్లా |
| తల్లిదండ్రులు | : విజయలక్ష్మి, అచ్యుతం |
| తోబుట్టువులు | : నాగేంద్రకుమార్, శ్రీ భవాని |
| భార్యాపిల్లలు | : మాలతీదేవి, గాయత్రి, భార్గవి |

| | | | |
|---|---|---|---|
| రచనలు | : ఆరాధన | (వచన కవిత్వం) | 1989 |
| | దృశ్యాదృశ్యం | (హైకూలు) | 1995 |
| | హైకూ | (హైకూలు) | 1997 |
| | పూలురాలాయి | (హైకూలు) | 1999 |
| | నేనే ఈ క్షణం | (వచన కవిత్వం) | 2006 |
| | ఆకాశం | (వచన కవిత్వం) | 2011 |
| | నీలో కొన్నిసార్లు | (వచన కవిత్వం) | 2015 |

| | | |
|---|---|---|
| పురస్కారాలు | : ఆంధ్ర సారస్వత సమితి అవార్డు, మచిలీపట్నం | 2004 |
| | స్నేహనిధి పురస్కారం; విశ్వకళాపీఠం, హైదరాబాద్ | 2012 |
| | ఇస్మాయిల్ కవితా పురస్కారం, కాకినాడ | 2011 |
| | గుంటూరుజిల్లా రచయితలసంఘం అవార్డు, గుంటూరు | 2011 |
| | నూతలపాటి కవితా సత్కారం, తిరుపతి | 2011 |
| | కె.వి.ఎస్. ఉగాది సాహిత్య పురస్కారం, ఏలూరు | 2015 |
| | తిలక్ అవార్డు, తణుకు | 2016 |


చిరునామా : బివివి ప్రసాద్, # **23-12-21**, సజ్జాపురం, తణుకు,
పశ్చిమ గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్ 534 211

ఫోన్ : **90320 75415**

ఈ మెయిల్ : prasadbvv1@gmail.com

బ్లాగ్ : bvvprasad.blogspot.in

